## సవరణ

ఈ పుస్తకంలో 3 చోట్ల వాక్యాలలో కొన్ని శబ్దాలు పొరపాటున వదిలివేయబడ్డాయి. దానివల్ల అర్థం సరిగా స్ఫురించుటలేదు. కనుక ఈ క్రింద తెలిపినవిధముగా సవరించి చదువుకోవలసినదని పాఠకులను కోరుచున్నాము.

1. 16 వ పేజీలోని 12 వ లైను ఈ క్రిందివిధంగా చదువుకోవాలి:
...“కొరకు ప్రభుత్వం ఈ విధమైన చట్టం చేసింది. దానిని వారు అనుసరించారు. అలాంటప్పుడు దేశశ్రేయస్సు దృష్ట్యా మనం స్వచ్ఛందంగా మనభూమిలోని ఒక భాగంపై”...
2. 36 వ పేజీలోని 17 వ లైను ఇలా చదువుకోవాలి:
(ఇంగ్లీషు)...“నేర్చుకొనుటకు ఎన్నిసంవత్సరాలు వృథాగా ఖర్చు పెడుతున్నామో, కనీసం అన్ని నెలలలైనా హిందీ”...
3. 50 వ పేజీలోని 21 వ లైను ఇలా చదువుకోవాలి:
...“క్షణభంగురమైనా వారికి ఫలితం వెంటనే కనబడుతుంది. యుద్ధసమయంలో జంతువుకి జంతువుకి”...

# నిర్మాణ కార్యక్రమము

రచన

గాంధీ

అనువాదము

లవణం



ప్రకాశకులు :
నవజీవన్ ట్రస్టు అనుమతితో
సర్వోదయ విచార్ ప్రచార్ ట్రస్టు
పక్షమున
గాంధి సాహిత్య
ప్రకాశన్ సమితి - ఆంధ్ర

సంచాలకుడు
రోకర్‌సీలాల్ జీ కాపడియా
గాంధీభవన్ : : హైద్రాబాదు.

★

తొలి ముద్రణ
జూలై 1958
ప్రతులు : రెండు వేలు
వెల : రు. 0-50

★

ముద్రణ :
అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు.

# निर्माण कार्यक्रमु

महात्मा गांधी जी

कृत

**रचनात्मक कार्यक्रम**

का

तेलुगु अनुवाद

अनुवादक: लवणम्

★

पहलीबार : २०००
मूल्य : रु. ०-५०
जुलै १९५८

★

प्रकाशक
सर्वोदय विचार प्रचार ट्रस्ट
के लिए गांधी साहित्य
प्रकाशन समिति-आंध्र
संचालक
ढोकरसी लालजी कापडिया
गांधी भवन, हैद्राबाद

# విషయసూచిక

# విజ్ఞప్తి

పూజ్య గాంధీజీ సిద్ధాంతములను, ఆదర్శములను ప్రచారము చేయు తలంపుతోను, ఆ మహాత్ములు సంకల్పించిన నిర్మాణ కార్యక్రమమును కొనసాగించు నుద్దేశముతోను, 1956 మే నెలలో "సర్వోదయ విచార ప్రచార ట్రస్టు" స్థాపింపబడినది. ఆ యాదర్శములను కార్యరూపములోనికి తెచ్చుటకుగాను మునుముందుగా 1957 లో "గాంధీ జ్ఞానమందిర"మను పేరుతో ఒక గ్రంథాలయము నెలకొల్పబడినది. అందు గాంధీ సాహిత్యమునకు సంబంధించిన వివిధ భాషలలోని గ్రంథములు గలవు. ఇంగ్లీషు, తెలుగు, కన్నడ, మరాటీ, ఉర్దూ, హిందీ భాషలలో గల గాంధీజీ జీవితము, వారి ఉపదేశములు, వారి గ్రంథములు, ఇంకను తత్సంబంధమయిన వాఙ్మయము అందు సంతరింపబడినది. అంతియగాక, ఈ జ్ఞానమందిర యాజమాన్యమున ప్రతివారమును సభలు జరుగుచుండును. ఆ సమయమున కొందఱు కొందఱు మహానుభావులు దయచేసి గాంధీజీ సిద్ధాంతములను గుఱించి అవి మానవజాతి నెట్లు కల్యాణమార్గమున నడపింపగలవో, ఆ విషయములను గుఱించి ఉపన్యసించు చుండెదరు.

ఈ ట్రస్టు యాజమాన్యమున, ఆంధ్రములో "గాంధీ సాహిత్య ప్రకాశక సమితి" ఏర్పాటు చేయబడినది. ఈ సమితివారు గాంధీజీ గ్రంథములను తెలుగులోనికి అనువాదము చేయించి ప్రకటించుచుండెదరు. అహమదాబాదులోని "నవజీవను ట్రస్టు"వారు ప్రస్తుతము పూజ్య బాపూజీ రచించిన 1. బేసికు (నవీన) విద్య 2. నిర్మాణ కార్యక్రమము 3. సర్వోదయము అను మూడు గ్రంథములను అనువాదము చేసి ప్రకటించుకొనుటకు ఈ ట్రస్టువారికి అనుమతిని

ఇచ్చియున్నారు. ఈ విధముగా గాంధీజీ గ్రంథములు ముందు ముందు అనువాదము చేయించి ప్రకటింపగలము.

పూజ్య బాపూజీచే వెలిగింపబడిన జ్యోతిని మూలమూలలకును వ్యాపింపజేయుటకయి ఈ ట్రస్టువారు తమ శక్తికొలది పాటుపడ గలరని విన్నవించుచున్నాను.

పూజ్య బాపూజీ రచనలలో ఇంతవఱకును తెలుగులో ప్రకటింప బడని గ్రంథములనే తొలుదొలుత ప్రకటింప సంకల్పించితిమి. శాశ్వత గ్రాహకులగువారికి పుస్తకములను తక్కువ వెలల కందింపదగు యోజన నేర్పఱచితిమి. కావున శాశ్వత గ్రాహకులు కాగోరువారు ఈ దిగువ చిఱునామాకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపగోరెదము.

ఆంధ్రమున గాంధీ సాహిత్యమును ప్రకటించు మా సంకల్పము పూజ్య బాపూజీ అంతరంగిక సహచరులు, మన ప్రియరాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ గారు తమ కరకమలములతో ఈ నవీనవిద్య, నిర్మాణ కార్యక్రమము అను రెండు పుస్తకములద్వారా ఈ యోజనను ఆవిష్కరింప నంగీకరించుటతో ద్విగుణీకృత సాఫల్యము నందినది. ఇది మా సౌభాగ్య విశేషమని భావించుచున్నాము.

గాంధీ భవనము
హైదరాబాదు (దక్కను)
15-7-1958.

తోకర్సీ లాల్జీ కాపడియా
*మేనేజింగ్ ట్రస్టీ*
సర్వోదయ విచార ప్రచార ట్రస్టు

# నివేదిక

గాంధిమహాత్ముడు భారతదేశ స్వతంత్ర ప్రదాతయే గాక సత్యయుగ స్థాపనాచార్యుడు. ప్రపంచమునందు అధర్మము ప్రబలి చిన్నజాతులను పెద్దజాతులు, బలహీనులను బలవంతులు అణగద్రొక్కి బానిసలుగ చేసికొనుచున్నారు. ద్వేషముతోను హింసతోను జాత్యహంకారముతోను లోకము నిండియున్నది. మానవకోటిని అవలీలగ భస్మము చేయగల ఆటంబాంబులను హైడ్రోజను బాంబులను వివిధ రాజ్యములు తయారు చేసికొనియున్నవి. మానవజాతి యంతయు యుద్ధభయములోను అశాంతిలోను మునిగి యున్నది. ఇట్టి విపత్సమయమున గాంధిమహాత్ముడు గొప్ప నైతిక ఆధ్యాత్మిక విప్లవమును జరిపి మానవజాతుల కాశాజ్యోతిని వెలిగించియున్నాడు. సమానత్వము, స్వతంత్రము, సోదరత్వము, ప్రేమ ధర్మము, అహింసలమీద మానవకోటిని పునరుద్ధరించగల మార్గములను చూపియున్నాడు. ఆటంబాంబు యుగమునుండి ధర్మసంస్థాపనా యుగమునకు తీసుకొనిపోయినాడు. భారతదేశ పునర్నిర్మాణమునకే గాక మానవకళ్యాణమునకు కూడ గాంధిగారి జీవితాదర్శముల బోధలు శరణ్యములు. స్వతంత్ర భారతదేశమం దొక యుజ్జ్వల భాగమైన ఆంధ్రదేశములో వాటిని బాగుగ వ్యాపించగల సాహిత్యమున కెంతేని ఆవశ్యకత గలదు. ఇంగ్లీషులో గాని, గుజరాతిలో గాని, హిందీలో గాని యున్న మహాత్మాగాంధిగారి రచనలను, వారినిగూర్చి వ్రాయబడిన గ్రంథములను హైదరాబాదు సర్వోదయ విచార ప్రచార ధర్మనిధివారి తోడ్పాటుతో తెనుగులోకి తర్జుమా చేయించి అచ్చువేయించి సరస

మైన ధరలకు విక్రయించుటకుగాను గాంధి సాహిత్య ఆంధ్ర ప్రచురణ సంఘమును హైదరాబాదులో నెలకొలిపితిమి.

ప్రథమ పుస్తకముగ (నయీతాలీమ్) నవీన విద్య అను గ్రంథముయొక్క తెనుగు అనువాదమును ప్రచురించుచున్నాము.

ఇది మేము ప్రచురించుచున్న రెండవ గ్రంథము. దీనిలో దేశ కళ్యాణప్రదమైన గాంధిగారి నిర్మాణ కార్యక్రమము వివరింపబడి యున్నది. ఆంధ్రులు దీనిని శ్రద్ధగ చదివి ఆచరణలో పెట్టుదురు గాక యని కోరుచున్నాను.

హైద్రాబాదు.
**14-7-1958**

అయ్యదేవర కాళేశ్వరరావు
అధ్యక్షుడు
గాంధి సాహిత్య ఆంధ్ర ప్రచురణ సంఘము

# ప్రస్తావన

1941 లో నేను రచించిన 'నిర్మాణ కార్యక్రమము' నకు ఇది పూర్తిగా సంస్కరింపబడి ప్రచురింపబడుచున్న ముద్రణ. ఇందులో చేర్చబడిన విషయాలు ప్రత్యేకంగా ఒక వరసలో అంటూ చేర్చుట జరగలేదు; వాటి ప్రాముఖ్యత ననుసరించి వాటికి స్థానం ఇచ్చుట జరగలేదనేది నిశ్చయము. కనుక పాఠకులు చదువుతూ ఉండగా, పూర్ణస్వరాజ్యమును నిర్మించు దృష్టితో అవసరమైన ఏ విషయమైనా వారికి ఇందు కనబడక పోతే అది బుద్ధిపూర్వకంగా వదిలివేయబడలేదని గమనించగలరు. ఏవిధమైన సంకోచము లేకుండా ఆ విషయాన్ని ఈ పట్టికలో చేర్చి, నాకు సూచించవచ్చును. నా ఈ పట్టిక సంపూర్ణమైనదని చెప్పడంలేదు; కేవలం నమూనాకుగాను దీనిని మీ ముందు పెట్టడం జరిగింది. ఇందులో ముఖ్యమైన కొత్తవిషయాలెన్నో చేర్చబడినట్లు పాఠకులు గుర్తించగలరు.

కార్యకర్తలూ, స్వయంసేవకులూ అయినా కాక పోయినా, సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించుటకు నిర్మాణ కార్యక్రమమే సత్యబద్ధమైన, అహింసాయుత మార్గమని పాఠకులు గుర్తించవలెను. దాని పూర్తిసిద్ధియే సంపూర్ణ స్వాతంత్ర్యము. దేశాన్ని పునాదులనుండి అభివృద్ధి పరచుటకు రచింపబడిన నిర్మాణ కార్యక్రమాన్ని పూర్తిగా సఫలం చేయుటకు

దేశంలోని నలభైకోట్ల ప్రజానీకమూ పూనుకుంటారనుకోండి. అప్పుడు, దాని పర్యవసానంగా అన్నివిధముల సంపూర్ణ స్వాతంత్ర్యమూ అంటే పరాయిపాలననుండి విముక్తులగుటకూడ సిద్ధించగలదని అంటే శంకించేవారెవరైనా ఉంటారా? విమర్శకులు నేను చెప్పేమాటలు విని నవ్వవచ్చు; అంటే నలభైకోట్ల ప్రజానీకమూ ఎప్పుడైనా ఈ కార్యక్రమాన్ని సఫలంచేసే ప్రయత్నంలో పాల్గొనగలరా అని వారు సందేహిస్తున్నారన్న మాట. వారు చేసే ఈ ఎగతాళిలో కొంత సత్యము లేక పోలేదు అయినా ఈ పనిచేసి చూడదగినదని నా సమాధానము. కర్తవ్యనిష్ఠగల కొందరు కార్యకర్తలు దృఢనిశ్చయంతో ఈ పనికి పూనుకుంటే, ఏ ఇతర పనివలెనైనా దీనినీ చేయవచ్చునంటాను; అంతేకాదు, ఎన్నో పనులకంటే దీనిని చక్కగా నిర్వహించవచ్చును. ఏది ఏమైనా, అహింసాయుతంగా కార్యము సాధించాలంటే ఇంతకంటే ప్రత్యామ్నాయము నావద్ద లేదు.

సమిష్టిగా గాని, వ్యక్తిగతంగా గాని చేయగల వినయపూర్వక శాసనోల్లంఘనము లేదా సత్యాగ్రహము నిర్మాణ కార్యక్రమానికి సహాయకారి కాగలదు. అంతేకాక హింసాయుత తిరుగుబాటుకు ఇదే చక్కటి ప్రత్యామ్నాయము. ఆయుధాలతో కూడిన తిరుగుబాటుకు అవసరమైనంత శిక్షణ సత్యాగ్రహానికి కూడా కావాలి. రెండు శిక్షణాపద్ధతులూ మాత్రం వేరువేరు. రెండు సందర్భాలలోనూ కూడా అవసరం కలిగినప్పుడే 'యుద్ధం' ప్రారంభమౌతుంది. సైనిక విప్లవానికి శిక్షణ పొందడమంటే మనమందరమూ ఆయుధాలను ఉపయో

గించుట నేర్చుకోవడం; బహుశః అణుబాంబులను ఉపయోగించే విధానమును నేర్చుకొనుటతోనే ఆ శిక్షణ పూర్తిఅవుతుందేమో. సత్యాగ్రహమునకు శిక్షణ అంటే నిర్మాణ కార్యక్రమమును అనుసరించుట.

కనుక కార్యకర్తలు ఎప్పుడూ సత్యాగ్రహము కొరకని పొంచిఉండరు. అయితే, నిర్మాణ కార్యక్రమాన్ని నాశనం చేయుటకు ప్రయత్నం జరిగితే మాత్రం, సత్యాగ్రహానికి సిద్ధంగా ఉంటారు. ఎక్కడ సత్యాగ్రహం చేయవచ్చును, ఎక్కడ కూడదు అనే విషయం ఒకటి-రెండు ఉదాహరణలు చూస్తే స్పష్టం అవుతుంది. రాజకీయ ఒడంబడికలు ఆపబడ్డాయి, ఆపబడగలవు, కాని వ్యక్తికీ వ్యక్తికీ మధ్య ఏర్పడే సన్నిహిత స్నేహాన్ని మాత్రం ఆపలేరు. అట్టి స్వార్థరహితమైన, నిజమైన మిత్రత్వమే రాజకీయ ఒడంబడికలకు పునాది కావాలి. అదేవిధంగా కేంద్రీకరింపబడిన ఖాదీ కార్యాన్ని ప్రభుత్వం నాశనం చేయగలదు. కాని ప్రజలు స్వయంగా ఖాదీ తయారుచేసి కట్టుకుంటే వారిని ఏ ప్రభుత్వమూ వారించలేదు. ఖాదీ తయారు చేయమనీ, కట్టుకోమనీ ప్రజలను బలవంతపెట్టకూడదు. ఖాదీని స్వాతంత్ర్యం కొరకు సాగే సమరంలో ఒక భాగంగా ఎంచి ప్రజలే స్వయంగా ఆలోచించి, సంతోషంగా స్వీకరించాలి. గ్రామాలను యూనిట్లుగా గుర్తించి అక్కడే ఈ పని చేయుటకు వీలుంటుంది. ఈ పనులు ముందుగా ప్రారంభించేవారు ఎన్నో అడ్డంకులను ఎదుర్కోవలసి వస్తుంది. అలాంటివారు ప్రపంచం అంతటా బాధలుపడి, అగ్నిపరీక్షలకు లోనుగావలసి వచ్చింది. కష్టాలు

సహించకుండా ఎక్కడైనా స్వరాజ్యం వచ్చిందా? హింసతో కూడిన యుద్ధంలో అన్నింటికంటె ముందుగానూ, అన్నిటికంటే హెచ్చుగానూ సత్యము బలిపెట్టబడుతుంది. కాని అహింసా యుత సమరంలో సత్యమే సదా విజయం సాధిస్తుంది. అంతే కాక నేడు ప్రభుత్వాధికారములో ఉన్నవారిని మన శత్రువులుగా భావించరాదు. అలా వారిని భావిస్తే అది అహింస అనే భావానికి వ్యతిరేకమౌతుంది. వారినుండి మనం విడిగానే ఉండాలి. అయితే మిత్రులవలె దూరంగా ఉండాలి.

నిర్మాణ కార్యక్రమాన్ని మీముందు పెట్టుటకు ముందుగా నేను పైనచెప్పిన ప్రాథమిక విషయాలు పాఠకులకు నచ్చితే, ఈ నిర్మాణ కార్యక్రమమందు శ్రద్ధ, కుతూహలము ఎక్కువగా కనబడగలవు. అప్పుడు రాజకీయాలనబడే వానిలోనూ, వేదిక లెక్కి ఉపన్యాసాలివ్వడంలోనూ కలిగే అనుభూతి, ఉండే శ్రద్ధ ఈ నిర్మాణ కార్యక్రమమందూ గోచరించగలవు. వాటికంటే ఈ నిర్మాణ కార్యక్రమము నిస్సందేహాముగా ఎక్కువ ముఖ్యమైనదీ, ఉపయోగకరమైనదీను.

పూనా, 13-11-1945.

మో. క. గాంధీ.

## భూమిక

నిర్మాణ కార్యక్రమాన్ని మరో విధంగానూ, ఇంకా ఉచితరీతినీ నిర్వచించాలంటే, సత్యాయుతమైన, అహింసాయుత సాధనాలద్వారా సంపూర్ణ స్వరాజ్యాన్ని నిర్మించుకొనుట అని చెప్పవచ్చును.

స్వాతంత్ర్యం అనే పేరుతో గుర్తింపబడేదానిని హింస ద్వారా, దానిలో నిహితమై యున్న అసత్యమయ సాధనాల సహాయంతో నిర్మించుటకు చేసే ప్రయత్నాలు ఎంతగా బాధా వహమైనవో మనకు చక్కగా తెలుసు. ఇప్పుడు కొనసాగు చున్న యుద్ధమునే తీసుకుని చూస్తే అనుదినమూ అందు ఎంత జననష్టం, సంపదనాశనం జరుగుతోందో! ఎంతగా సత్యము హత్య చేయబడుతోందో!

సత్యాయుతమైన, అహింసాయుత సాధనాల ద్వారా పూర్ణ స్వరాజ్యాన్ని సాధించడమంటే, వర్ణ, జాతి, కుల, మత భేదము పాటించకుండా, ఎంత చిన్న యూనిట్ అయినా, ప్రతీదానికీ, అందులో ఉండే అతి సామాన్యమైన వ్యక్తికికూడా స్వాతంత్ర్యం సమకూర్చడం. ఈ స్వాతంత్ర్యంనుండి ఎవరినీ మినహాయింప వీలులేదు. కనుక దేశంబయట ఇతర దేశాల తోనూ, దేశంలోపల ప్రజానీకంమధ్యా పరస్పరావలంబనం, పరస్పర సహకారంతో స్వాత్యంత్ర్యం కొనసాగుతుంది. మనం గీసే ఏ సరళరేఖ అయినా యూక్లిడ్ శాస్త్ర దృష్టితో చూస్తే

అసమగ్రంగా ఉన్నట్లే, ఆచరణ ఎప్పుడూ ఆదర్శంతో పోల్చి చూస్తే అసంపూర్ణంగానే ఉంటుంది. కనుక మన దైనందిన జీవితములోనికి ఎంతగా మనం సత్యాహింసలను ఆచరిస్తామో అంతవరకే సంపూర్ణ స్వరాజ్యము సిద్ధిస్తుంది.

నిర్మాణ కార్యక్రమముయొక్క పూర్తి చిత్రమును పాఠకులు ఊహించి చూచుకుంటే, ఈ కార్యక్రమాన్ని పూర్తిగా విజయవంతం చేసినప్పుడు, దాని ఫలితంగా, మనకు అవసరమైయున్న సంపూర్ణ స్వరాజ్యం సిద్ధించగలదని నేను చెప్పే విషయంతో ఏకీభవించగలరు. భారతదేశంలోని ముఖ్యమైన పార్టీలు ఒక ఒడంబడికకువస్తే దానిని గౌరవిస్తామని స్వయంగా మిస్టర్ అమెరీ చెప్పలేదా ? దానినే నా భాషలో చెప్పాలంటే నిర్మాణకార్యక్రమంలో కేవలం ఒక అంశమైన మతసామరస్యము సిద్ధించినప్పుడే అన్ని పార్టీలమధ్య ఒడంబడిక కుదురుతుంది; దానిని బ్రిటిష్ ప్రభుత్వము మన్నిస్తుంది. అమెరీగారి నిజాయితీని శంకించవలసినపనిలేదు. ఎందుచేతనంటే ఆ విధమైన ఐక్యత నిజాయితీతో, అంటే అహింసాయుతంగా మనం సాధిస్తే, అందులోనే అందరికీ అంగీకారయోగ్యమైన కోర్కెను వారిచే ఆమోదింపజేసే శక్తి ఇమిడి ఉంటుంది.

ఇందుకు విరుద్ధంగా హింసాయుత పద్ధతులద్వారా సంపాదించబడే స్వాతంత్ర్యానికి ఊహామాత్రమైనగాని లేక సంపూర్ణమైన వ్యాఖ్యగాని లేదు. ఎందుకంటే ఈ విధమైన స్వాతంత్ర్యంలో దేశంలో హింసాయుత సాధనాలను ఏ పార్టీ హెచ్చుగా ఉపయోగిస్తుందో దాని మాటే చెల్లుతుంది. అట్టి

దానిలో ఆర్థికంగాగాని, మరే రంగంలోగాని సంపూర్ణ సమానత్వము ఊహాతీత మౌతుంది.

కాని ప్రస్తుతము పాఠకులనుండి నేను ఒకవిషయమే ఆశిస్తున్నాను. స్వరాజ్య స్థాపనకు అవసరమైన అహింసాత్మక పురుషార్థమునకుగాను నిర్మాణకార్యక్రమాన్ని అర్థంచేసుకుని ఆచరించాలని నేను అంటున్నాను. నా ఈ ప్రతిపాదనను అంగీకరించుటకు, పూర్ణస్వరాజ్యమును సాధించుటకు హింసాయుత సాధనములు ఏమాత్రమూ పనిచేయవు అనే నా రెండవ విషయమును కూడ ఒప్పుకు తీరవలసిన అవసరంలేదు. ఎందుచేతనంటే హింసాయుత సాధనములద్వారాకూడ దేశంలో అట్టడుగున పడిఉన్న వ్యక్తికి స్వాతంత్ర్యం సంపాదించుటకు వీలుంటుందని ఎవరైనా విశ్వసిస్తే స్వేచ్ఛగా విశ్వసించవచ్చును. అయితే దానితో పాటు దేశం నిర్మాణ కార్యక్రమాన్ని సక్రమంగా ఆచరిస్తే దానివల్లకూడా నిస్సంశయంగా పూర్ణస్వాతంత్ర్యం వస్తుందని అంగీకరిస్తే, ప్రస్తుతానికి వారి రెండవ అభిప్రాయంగురించి నేను ఏమీ చెప్పనవసరంలేదు.

ఇక, ఇప్పుడు నిర్మాణ కార్యక్రమముయొక్క ఒక్కొక్క అంశముగురించే విచారిద్దాము.



# 1 మత సామరస్యము

మత ఐక్యత లేక మత సామరస్యముయొక్క అవసరం అందరూ అంగీకరించినదే. కాని ఇంకా ఐక్యత అంటే కేవలం రాజకీయ ఐక్యత మాత్రమేకాదు అనే విషయం అందరికీ అర్థం కాలేదు. రాజకీయ ఐక్యత అయితే బలవంతాన సాధించవచ్చును. జాతీయ ఐక్యత అంటే విడదీయరాని హృదయైక్యత. ఇట్టి ఐక్యతను సాధించుటకుగాను ప్రతీ కాంగ్రెసువాది, ఆయన ఏమతానికి చెందినవారైనా సరే, హిందూ, ముస్లిం, క్రైస్తవ, పారశీక, యూదు మొదలైన అన్ని ధర్మాలకు తాను చెందిన వాడనని భావించుకోవాలి. భారతదేశంలోని కోట్లాది భారతీయులలోని ప్రతి ఒక్కనితోనూ ఆత్మీయతను అనుభవించాలి. ఇట్టి ఆత్మీయతను సాధించుటకుగాను ప్రతీ కాంగ్రెసువాది తన మతస్థులతోనేగాక, ఇతర మతస్థులతోకూడ వ్యక్తిగత మిత్రత్వ మును పెంచుకోవాలి. తన మతముయెడల ఎట్టిప్రేమ తనకు గలదో అట్టిప్రేమనే ఇతర మతములయెడల కూడ చూపాలి.

అట్టి సంతోషప్రదమైన వాతావరణంలో, నేడు రైలు స్టేషనులలో వినపడుచున్న 'హిందూ పానీ', 'ముస్లిం పానీ'; 'హిందూ చా', 'ముస్లిం చా' అనే లజ్జాకరమైన కేకలు విన బడవు. అప్పుడు పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ హిందువులకూ, హిందూయేతరులకూ ప్రత్యేకముగా గదులుగాని,

మంచినీటి కుండలుగాని ఉండవు. అలాగే మత ప్రాతిపదికపై పాఠశాలలు, కళాశాలలు, ఆస్పత్రులు ఉండవు. ఏవిధమైన రాజకీయ దురభిప్రాయాలు వెనుకలేని నిజాయితీతో కూడిన శీలముతో ప్రతీ కాంగ్రెసువాది అట్టి విప్లవాచరణకు పూనుకోవాలి. అట్టి పరిశుద్ధాచరణవల్ల రాజకీయ ఐక్యత సహజంగానే సిద్ధిస్తుంది.

శాసనసభల ద్వారానే అధికారం చేజిక్కుతుందనే ఆలోచనకు మనం చాలాకాలంగా అలవాటు పడ్డాము. మన ప్రజల్లో ఏర్పడియున్న ఘోరమైన పొరపాటు అభిప్రాయము ఇది. ఇందుకు మనలోని జడత్వమూ, ఇంగ్లీషు సాంప్రదాయాలూ, అలవాట్లూ కారణంగా మనలో ఏర్పడిన వ్యామోహమూ, కారణాలు. బ్రిటిష్ చరిత్రను పైపైన చూచుటచేత పార్లమెంటు నుండే ప్రజలకు అధికారము సంక్రమిస్తుందనే అభిప్రాయం మనలో ఏర్పడింది. కాని యథార్థం ఏమంటే అధికారం ప్రజలదే, అది ప్రజలలోనే ఉంటుంది. తాత్కాలికంగా కొంత సమయానికి ఆ అధికారము తమ ప్రతినిధులుగా ఎన్నుకోబడ్డ వారికి అప్పగించడం జరుగుతోంది. ప్రజలు లేకుండా శాసనసభలకు అధికారంగాని, అస్థిత్వంగాని లేవు. ప్రజలకు ఈ సాధారణ సత్యాన్ని నచ్చచెప్పుటకే గత 21 సంవత్సరాలుగా నేను ప్రయత్నిస్తున్నాను. శాసనోల్లంఘనము లేక సత్యాగ్రహము అనునది అధికారానికి నిలయము. ఒకదేశానికి దేశము శాసనసభల శాసనాలను అనుసరించక, వాటిని వ్యతిరేకించి, ఈ శాసనోల్లంఘనము (Civil Disobedience) వల్ల వచ్చే

ఫలితాలను అనుభవించుటకు సిద్ధంగా ఉంటుందనుకోండి. అప్పు డేమౌతుందో ఊహించండి! ప్రజల అట్టి ప్రయత్నము ప్రభుత్వము యొక్క శాసనసభలను, వాని పరిపాలనా యంత్రాంగాన్ని ఎక్కడికక్కడ నిలిపివేస్తుంది. ప్రభుత్వ శక్తిగాని, పోలీసు శక్తి గాని, సైనిక శక్తిగాని అది ఎంత బలమైనదైనప్పటికీ కొంత మందిని అణచుటలోనే సఫలత నొందగలదుగాని, పూర్తి దేశ మంతా ఎట్టి బాధలనైనా సహించుటకు నిశ్చయించుకుంటే వారి దృఢసంకల్పాన్ని కదిలించుట దానికి అసాధ్యమౌతుంది.

ఇక, పార్లమెంటరీ శాసనవ్యవస్థ, దానిలోని సభ్యు లందరూ మెజారిటీ నిర్ణయానికి కట్టుబడి యుంటేనే చక్కగా సాగగలుగుతుంది. వేరుమాటలలో చెప్పాలంటే పార్లమెంటరీ శాసనవ్యవస్థ పరస్పరానుకూలమైన సమూహాములందే నడువ గలదు.

ఇక్కడ, మన భారతదేశంలో, మత ప్రాతిపదికపై ఓటర్లను వేరువేరు సమూహాలుగా బ్రిటిష్ ప్రభుత్వం చీలదీసింది. దీనివల్ల పరస్పరం సంబంధం లేకుండా కృత్రిమ అడ్డుగోడలు ఏర్పడ్డాయి. ఇట్టిస్థితిలో పార్లమెంటరీ శాసనపద్ధతిని అనుస రిస్తోన్నట్లుగా నటించుట మాత్రమే జరుగుతోంది. వేరువేరుగా ఉన్న, ఈ కృత్రిమంగా విడదీయబడ్డ సమూహాలను ఏదో ఒక పనికొరకు ఒకే వేదికపై చేర్చినా సజీవమైన ఐక్యత ఎన్నటికీ సిద్ధించదు. అట్టి శాసనసభలు పరిపాలనాకార్యాన్ని కొనసాగిస్తూ ఉండవచ్చుగాక. కాని ఈ శాషనసభావేదికలపై చేరి మనం పోట్లాడుకుంటూనే ఉంటాము. మనపైన పరిపాలిస్తున్న వారు

అప్పుడప్పుడు మనకు ప్రసాదించే అధికారాలను పంచుకొనుటకు కాట్లాడుకునే వేదికలుగానే ఇవి మిగిలిపోతాయి. మన పాలకులు మనలను కఠినంగా అదుపులో పెట్టి పరస్పర వ్యతిరేక తత్వాలు పోట్లాడుకోకుండా ఆపుతున్నారు. ఇట్టి లజ్జాకరమైన స్థితిలో పూర్ణస్వరాజ్యం సిద్ధించగలదంటే నాకు అసంభవంగా తోస్తోంది.

శాసనసభల గురించి, వాటి కార్యకలాపాల గురించి నాకింత గట్టి అభిప్రాయాలు ఉన్నప్పటికీ, ఎన్నికలద్వారా రూపొందే ప్రాతినిధ్య సంస్థలకు అయోగ్యులు అభ్యర్థులుగా నిలుచుంటున్నంత కాలం ప్రాతినిధ్య సంస్థలలోనికి అభ్యుదయ నిరోధకులు ప్రవేశించకుండా చూచుటకు కాంగ్రెసు తన అభ్యర్థులను నిలపాలనే నిశ్చయానికి నేను వచ్చాను.



హిందూమతానికి శాపంగానూ, మాయని మచ్చగానూ తయారైన అస్పృశ్యతను నిర్మూలించవలసిన అవసరం గురించి ఇప్పుడు, ఈ సమయంలో ఎక్కువగా వ్రాయవలసిన పనిలేదు. ఈ విషయంలో కాంగ్రెసువారు చాలవరకూ పనిచేసినమాట వాస్తవమే. కాని, నేను బాధపడుతూ చెప్పవలసివస్తున్న విషయం ఏమిటంటే చాలమంది కాంగ్రెసువారు, హిందువులైన కాంగ్రెసువారు, హిందూమతంయొక్క అస్థిత్వానికే అవసరమని భావించుటకు బదులుగా, అస్పృశ్యతా నిర్మూలనను కేవలం ఒక రాజకీయఅవసరంగా మాత్రమే చూస్తున్నారు. కాంగ్రెసులోని హిందువులు ఈ కార్యనిర్వహణలోనే తమ సార్థకత యున్నదని భావించి ఈ పనికి పూనుకుంటే 'సనాతనుల' పై పూర్వంకంటె ఎక్కువగా తమ ప్రభావం పడునట్లు చేసి వారి హృదయపరివర్తనం కలుగునట్లు చూడగలరు. 'సనాతను'ల చెంతకు వారితో కయ్యంపెట్టుకునే భావంతోకాక, అహింసకు శోభనిచ్చు మిత్రత్వభావంతో వెళ్లాలి. హరిజనులతో సంబంధించినంతవరకూ ప్రతి హిందువూ హరిజనుల పనిని తన పనిగా భావించాలి. వెలివేయబడి, దూరంచేయబడి దయానీయమైన స్థితిలో ఉంటున్న హరిజనులను హిందువులు తమ మిత్రులుగా భావించి ప్రతీ విషయంలోనూ వారితో కలిసిమెలసి ఉండటం

నేర్చుకోవాలి. హరిజనులు మనదేశంలో ఎట్టి భయంకరమైన విపరీతమైన వెలికి లోనై యున్నారో అట్టిస్థితి ప్రపంచంలో మరెక్కడా కనబడదు. ఈ పని ఎంత కష్టమైనదో నాకు తెలుసు. నాకు వ్యక్తిగతంగా ఎన్నో అనుభవాలు వచ్చాయి. కాని స్వరాజ్య సౌధాన్ని నిర్మించే ఏ కార్యభారాన్నైతే మనం భుజస్కంధాలపై తీసుకున్నామో అందులోనే ఇదికూడా ఒక భాగము. ఆ స్వరాజ్య లక్ష్యంవరకూ తీసుకువెళ్ళే మార్గం కంటకావృత్తమై, నిన్నగా ఎక్కవలసినదీ, కష్టసాధ్యమైనదీను. ఆ త్రోవలో ఎన్ని జారుడు మార్గాలను, లోతైన అఖాతాలను దాటాలో! ఏమైనా శిఖరంవరకూ ఎక్కి అక్కడే స్వాతంత్ర్య వాయువులు పీల్చుటకుగాను ఎన్ని అఖాతాలనైనా దాటి, ఎంతజారుడు త్రోవనైనా పయనించి, బలమైన అడుగులతో ముందుకుపోవలసి ఉంది.

---

# 3 మద్య నిషేధము

మత సామరస్యము, అస్పృశ్యతా నిర్మూలన వలెనే 1920 నుంచీ మద్య నిషేధముకూడా జాతీయ కాంగ్రెస్ కార్యక్రమంలో భాగంగా ఉన్నప్పటికీ, ఈ సాంఘిక, నైతిక సంస్కరణ కార్యక్రమంలో కాంగ్రెసువారు అవసరమైనంత శ్రద్ధ తీసుకుని పని చేయలేదు. అహింసాయుత విధానంలో మనం లక్ష్యాన్ని చేరదలకుంటే నల్లమందు, మద్యము వంటి మత్తు పదార్థాల ఉచ్చులో చిక్కుకున్న కోట్లాది దేశీయుల భాగ్య రేఖను భవిష్యత్తులో ఏర్పడబోయే ప్రభుత్వ ఇష్టాయిష్టాలకు వదిలిపెట్టలేముగదా.

ఈ దురలవాటును మాన్పించుటలో డాక్టర్లు, వైద్యులు సమర్థవంతంగా పనిచేయగలరు. మద్యము, నల్లమందు వంటి వ్యసనాలలో చిక్కుకున్న వ్యక్తులను వాటి బారినుండి రక్షించే ఉపాయాలను, మెళుకువలను వైద్యులు కనిపెట్టి వాటిని ఆయావ్యక్తులపై పరీక్షించిచూడాలి.

ఈ సాంఘిక సంస్కరణను విజయవంతంగా కొనసాగించుటలో స్త్రీలు, విద్యార్థులు ఎక్కువగా తోడ్పడగలరు. ప్రేమ పూర్వకంగా సేవచేసి, ఈ వ్యసనాలకు అలవాటుపడినవారి హృదయాలను జయిస్తే ఈ సేవకులు చెప్పేవిషయాలను వారు వినక తప్పదు.

కాంగ్రెసు సంఘాలు వినోదకేంద్రాలను, విశ్రాంతి గృహాలను నడిపితే, అలసిపోయిన కార్మికులు సేదతీర్చుకొనుటకు, విశ్రాంతి తీసుకొనుటకు ఉపయోగపడగలవు. అట్టి ప్రదేశాలలో ఆరోగ్యకరమైన, స్వచ్ఛమైన పానీయములు, ఫలహారములు తక్కువ ధరలకు లభింపజేయవలెను. అచ్చటికి వచ్చువారు ఆట-పాటలలో పాల్గొనుటకు వీలు కలగజేయవలెను. ఈ విధంగా పనిచేస్తే మనస్సుకు ఆహ్లాదము కలుగజేయుటేకాక మనిషిని సంస్కరించి ఉత్తమునిగా చేయుటకు వీలు కలుగుతుంది. స్వరాజ్యమును సాధించుటకు అహింసాయుత మార్గము పూర్తిగా క్రొత్తవిధానము. ఇందు ప్రాత విలువలకుబదులు క్రొత్తవిలువలను స్వీకరించవలసి ఉంటుంది. ప్రాతవిషయాలను క్రొత్త దృష్టితో చూడవలసి ఉంటుంది. హింసాయుత విధానములో ఇట్టి సంస్కరణలకు అవకాశం ఉండదు. హింసాయుత విధానాన్ని ఆమోదించువారు తమ అజ్ఞానం కారణంగా, ఈవిధమైన పనులన్నీ స్వరాజ్యం వచ్చినతర్వాత చేయవలసినవని భావించి అంతవరకూ వీటిని వాయిదావేస్తారు. కాని వారు ఒక విషయాన్ని మర్చిపోతున్నారు. స్థిరమైన, నిజమైన, దోషరహితమైన విముక్తి హృదయాంతరాళంనుండే ప్రారంభమౌతుంది. అంటే ఆత్మశుద్ధి వల్లనే ఆ విముక్తి లభిస్తుంది. నిర్మాణ కార్యకర్తలు మద్యనిషేధాన్ని పూర్తిగా విజయవంతం చేయలేకపోయినా కనీసం అట్టి శాసనానికి అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించి, దారిని సుగమం చేయగలరు.

---

ఖాదీ వివాదాస్పదమైన విషయం. నేను ఖాదీని సమర్థించుట ద్వారా ఏటికి ఎదురీదుతున్నాననీ, తద్వారా స్వరాజ్య నౌకను ముంచివేయగలననీ, చివరకు దేశాన్ని అంధకారము లోనికి తీసుకువెళ్లెదననీ చాలమంది అనుకుంటున్నారు. ఈ క్లుప్తమైన వివరణలో నేను ఖాదీని బలపరిచేవాదన చేయదలచలేదు. ఇతర సందర్భాలలో ఆ విషయమై చాలా చర్చించాను. ప్రతీ కాంగ్రెసువాది, అంతేకాక మరోలా చూస్తే ప్రతీ భారతీయుడు, ఖాదీని అభివృద్ధి పరచుటకు ఏమేమి చేయగలడు అనేదే నేనిక్కడ వివరించ దలచుకున్నాను. ఖాదీ అంటే దేశంలోని అందరికీ ఆర్థిక స్వాతంత్ర్యం, సమానత్వ ప్రారంభం అని అర్థం. ఏ విషయమైనా ఎలాంటిది అనేది ఆచరణబట్టి తెలియాలి. కాయబట్టి చెట్టును గుర్తించవచ్చును. కనుక నేనుచెప్పే విషయంలో ఎంత యథార్థం ఉందో ప్రతీవ్యక్తీ, స్త్రీగాని, పురుషుడుగాని, ఆచరించి తెలుసుకోవచ్చును. ఖాదీని స్వీకరించడమంటే దానితో పాటు అందుకు సంబంధించిన అన్ని విషయాలనూ స్వీకరించాలి. అంటే సంపూర్ణమైన స్వదేశీభావన, జీవితావసర వస్తువులన్నిటినీ, మన దేశంలోని గ్రామీణుల శ్రమ, బుద్ధిద్వారా తయారైన వస్తువులనే వాడెదమని నిర్ణయించుకోవాలి. అంటే ఇప్పుడున్న రీతిని తల్లక్రిందులు చేయడం. మరోమాటలలో చెప్పాలంటే

భారత దేశంలోని ఏడులక్షల గ్రామాలనూ పీల్చి పిప్పిచేసి, పీడించి ఇండియాలోనూ, బ్రిటన్‌లోనూ గల ఏ అరడజను నగరాలో వర్ధిల్లడం కాక, ఏడులక్షల గ్రామాలూ స్వయంపోషకమై, స్వచ్ఛందంగా భారతదేశ పట్టణాలకు సేవచేయుటే కాక, ప్రపంచంలోని ఇతరదేశాల పట్టణాలకు కూడా సహాయపడడం. అయితే ఇందు ఇరుపక్షాలకు శ్రేయస్కరమైన విధానం అమలు జరగాలి.

అంటే మనలో చాలమంది మానసిక భావములనూ, రుచులనూ ఎంతో విప్లవాత్మకంగా మార్చుకోవలసి ఉంటుంది. అహింసాయుత విధానం ఎన్నో విషయాలలో సరళమైనదీ, సుగమమైనదీ. అయితే, మరికొన్ని విషయాలలో అది చాల కష్టమైనది. ప్రతీ భారతీయుని జీవితంలోనూ ప్రవేశించి ప్రతీ విషయాన్నీ అది స్పృశిస్తుంది. అది అతనిలో ఇంతవరకూ నిద్రాణమై, చైతన్యరహితమై యున్న శక్తులను మేల్కొలిపి అతనికి వాటిని గుర్తింపజేస్తుంది. ఈ శక్తి అతనిలో ఉందనే జ్ఞానం కలిగించుటద్వారా అతనిని ఉత్సాహపరుస్తుంది. ఈ భారతీయ మానవ మహాసాగరములోని అనేక బిందువులలో తానూ ఒకడననే భావన అనుభవంలోనికి రాగానే అతను అందుకు గర్విస్తాడు. పురాతనకాలం నుంచి నిస్సారమైన ఏ ప్రవృత్తిని అహింస అనుకుంటున్నామో, దానికీ నా అహింసకూ సంబంధం లేదు; ఇది అదికాదు. మానవజాతికి ఇంతవరకూ పరిచయమైన శక్తులన్నిటిలోనికీ ఈ అహింస శక్తివంతమైనది. దీనిపైననే మానవజాతియొక్క అస్తిత్వం

ఆధారపడి ఉంది. మొదట కాంగ్రెసుముందు, కాంగ్రెసు ద్వారా ప్రపంచంముందు ప్రవేశపెట్టాలని నేను ప్రయత్నించిన అహింసాశక్తి ఇది. భారతదేశంలోని మొత్తం ప్రజలఐక్యతకు, ఆర్థిక స్వాతంత్ర్యానికి, సమానత్వానికి ఖాదీ చిహ్నమని నా అభిప్రాయము. దీనినే జవాహర్‌లాల్ యొక్క కవితాధోరణిలో చెప్పాలంటే "ఖాదీ భారతీయ స్వాతంత్ర్యానికి వస్త్రాభూషణం."

ఖాదీ మన స్తత్వం అంటే, జీవితావసర వస్తువుల ఉత్పత్తిలోనూ, పంపిణీలోనూ వికేంద్రీకరణ అందుచేత ఇంతవరకూ అనుకున్న విధానం ప్రకారం ప్రతీగ్రామమూ తన అవసరాలకు కావలసిన వస్తువులన్నీ తాను ఉత్పత్తి చేసుకోవాలి. అంతేకాక పట్టణాలకొరకు కొంత ఎక్కువభాగం కూడా ఉత్పత్తి చేయాలి.

భారీ పరిశ్రమలను జాతీయంచేసి, కేంద్రీకరించక తప్పదు. అయితే, అత్యధికంగా గ్రామాలలోనే అమలుజరిగే విశాలమైన జాతీయకార్యక్రమంలో ఆ భాగం చాల చిన్నదై ఉంటుంది.

ఖాదీలో ఏఏ విషయాలున్నాయో ఇంతవరకూ చెప్పాను. ఇక కాంగ్రెసువారు ఖాదీని అభివృద్ధి పరచుటకు ఏమేమి చేయగలరు, ఏమేమి చేయాలి అనే విషయాలగురించి ఇప్పుడు చెబుతాను. ప్రత్తి పండించడం, ప్రత్తిని ఏరడం, దానిని శుభ్ర పరచడం, గింజలు తీయడం, ఏకులు తయారు చేయడం, వడకడం, నూలు పుంజాలు తయారు చేయడం, వాటికి రంగువేయడం, పడుగు-పేక కట్టినేయడం, బట్ట ఉతకడం-ఇవన్నీ ఖాదీ ఉత్పత్తిలో

ఇమిడి ఉన్నాయి. వీనిలో రంగువేయుటను మినహాయిస్తే మిలిగినవన్నీ అత్యావసర విషయాలు. ఈ పనులలో ప్రతీదీకూడ గ్రామాలలో చేయ వీలైనదే. ప్రస్తుతము అఖిలభారత చరఖా సంఘము పనిచేయుచున్న ప్రతీగ్రామములోనూ ఈ విధాన మంతా అమలు జరుగుతోంది. చరఖా సంఘం ఈ మధ్యనే ప్రచురించిన నివేదిక ననుసరించి ఈ పనులకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన అంకెలు ఉదహరిస్తాను :

1940లో 13,451 గ్రామాలకు చెందిన 2,75,146 మంది గ్రామస్తులకు వడుకుట, నేత మొదలైన పనులకుగాను మొత్తం రు. 34,85,609 లు కూలిగా ఇవ్వబడ్డాయి. వీరిలో 19,645 మంది హరిజనులు; 57,378 మంది మహమ్మదీయులు. వడకువారిలో ఎక్కువమంది స్త్రీలు.

కాంగ్రెసు వారందరూ శ్రద్ధగానూ, పూర్తిశక్తిని వినియోగించీ పనిచేస్తే ఎంతపని కాగలుగుతుందో అందులో ఇప్పటికి జరిగినది ఏ వందవభాగమో మాత్రమే. గ్రామాలలో కొనసాగింపబడుతూ వచ్చిన అనేక గ్రామపరిశ్రమలను, వాటిలో ఈ వస్త్ర పరిశ్రమను - దీనిని ఆధారం చేసుకొనియున్న అనేక ఇతర కళలను ఆలోచించకుండా, దయ - దాక్షిణ్యం లేకుండా, ఇష్టం వచ్చినట్లుగా నాశనం చేసినప్పటినుంచీ మన గ్రామాల అభివృద్ధి, కళ దిగజారిపోయాయి. గ్రామాలలో ఎండుడొక్కలతో కనబడే పశువులరూపంలోనికి మన గ్రామాలు నిస్తేజమై, నిష్ప్రాణమై దిగజారిపోయాయి.

ఖాదీ కార్యక్రమాన్ని విజయవంతం చేయమని కాంగ్రెసు ఇచ్చిన పిలుపును అందుకుని కాంగ్రెసువాదులు నిజాయితీతో పనిచేయాలనుకుంటే అ. భా. చరఖాసంఘం అప్పుడప్పుడు ఇచ్చే సూచనలను వారు అనుసరించాలి. కొన్నిటిని ఇక్కడ ఉదహరిస్తాను :

1. భూమిగల ప్రతీ కుటుంబం కొద్దిపాటి భూమిపై కనీసం తమ కుటుంబానికి అవసరమయ్యేదైనా పండించుకోవచ్చును. ప్రత్తిని పండించడం చాల తేలికైన పని. ఒకప్పుడు బీహార్‌లో ప్రతీరైతూ తాను సేద్యంచేసే భూమిలో కనీసం శ౧ వ భాగం భూమిలో నీలిమందు పండించాలని ప్రభుత్వం చట్టం చేసింది. విదేశీ నీలిమందు వ్యాపారస్తుల లాభం కొరకు మనం స్వచ్ఛందంగా మన భూమిలోని ఒక భాగంపై ప్రత్తిని ఎందుకు పండించకూడదు? ఖాదీ పని ప్రారంభం నుండే వికేంద్రీకరణం ఆరంభమౌతుందని పాఠకులు గమనించగలరు. నేడు ప్రత్తిపంట కేంద్రీకరింపబడి ఉంది. అందు చేత పంటను పండినచోటనుండి మన దేశంలోని దూరదూర ప్రదేశాలకు పంపవలసి వస్తోంది. యుద్ధానికి పూర్వం ప్రత్తి ముఖ్యంగా బ్రిటనుకూ, జపాన్‌కు పంపబడేది. ఇప్పటికీ అది వ్యాపారపు పంటే. అందువలన బజారులలో కలిగే మార్పులకు అది లోనవుతుంది. ఖాదీ ప్రణాళిక ననుసరించి ప్రత్తిపెంపకం ధరల నిలకడలేనితనంనుండి బయటపడుతుంది. రైతు తన కేది అవసరమో దానినే పండిస్తాడు. రైతు ముందుగా తన అవసరాలకు కావలసిన వస్తువులనే పండించాలని తెలుసుకోవడం

ముఖ్యం. అతనలా చేసినప్పుడు బజారులో ఏర్పడే ధరల మాంద్యంవల్ల అతను నాశనంకాకుండా కాపాడబడతాడు.

2. నూలువడికేవాడు తనవద్ద స్వంతప్రత్తి లేకపోతే తన కవసరమైన ప్రత్తిని బయట కొంటాడు. గింజలుతీసే రాట్నం లేకపోయినా ప్రత్తినుండి గింజలు తేలికగానే తీయగలుగుతాడు. గింజలుతీయుటకు ఒక ఇనపకడ్డీ, చెక్క చాలు. ఇది కుదరకపోతే చేతితో గింజలు తీయబడిన ప్రత్తిని కొని ఏకవచ్చును. వెదురు వంచి నరముకట్టి తేలికగానే దూదిని ఏకవచ్చును. ఎంత ఎక్కువ మంది మీద శ్రమ విభజింపబడితే సాధనాలు అంత తేలికగానూ చవకగానూ ఉంటాయి. ఏకినదూదిని ఏకులుగా చేసుకోగానే వడుకుట ప్రారంభమౌతుంది. నూలు వడుకుటకు నేను ధనుష్ తక్లీని ప్రత్యేకముగా సిఫార్సుచేస్తున్నాను. నేను తరుచుగా దానిని ఉపయోగించాను. రాట్నంమీద వచ్చినంత వేగముగానే నేను ధనుష్ తక్లీమీద నూలు వడకగలిగాను. మంచి సన్నమైన దారమే తీశాను. రాట్నంమీదకంటె ధనుష్ తక్లీమీద తీసేనూలు ఎక్కువ బలంగానూ, సాఫీగానూ, పురికలిగి ఉంటుంది. అయితే అందరికీ ఒకేవిధంగా ఇది ఉపయోగకారి కాకపోవచ్చు. నేను ధనుష్ తక్లీని ఎందుకింత గట్టిగా సమర్థిస్తున్నానంటే, దానిని తేలికగా తయారుచేయవచ్చును, చాల చవకైనది. రాట్నంవలె దీనిని ఎక్కువగా మరమ్మతు చేయవలసిన అవసరం కలుగదు. వడికే వానికి పెద్ద మాల, చిన్న మాల వేసుకోవడం చేతకాక పోయినా, మాల గాడి తప్పినప్పుడు తిన్నగా పెట్టుకోవడం చేత గాకపోయినా, చక్రం సరిగా పనిచేయకపోతే దానిని సర్దు

కోవడం చేతగాకపోయినా రాట్నంపనిలేక మూలపడుతుంది. అంతేకాక లక్షలాదిమంది ఒకేసారి వడకవలసిన అవసరంరావచ్చు. అలాంటప్పుడు ధనుష్ తక్లీ తయారుచేయడం, ఉపయోగించడం తేలిక గనుక అదే అవసరానికి ఆదుకోగలుగుతుంది. మామూలు తక్లీకంటెకూడ తేలికగా దానిని తయారుచేయవచ్చును. దానిని తేలికగాను, చక్కగాను, చవకగాను తయారుచేసుకోవాలంటే స్వయముగా చేసుకోవడమే మార్గం. ప్రతివాడూ సాధారణమైన పనిముట్లను తయారుచేయడం, ఉపయోగించడం నేర్చుకోవాలి. వడకడంవరకూ జరిగే ఖాదీ కార్యకలాపాలలో దేశంఅంతా పాల్గొంటే, దానివల్ల ఎంతటి ఐక్యత, విజ్ఞానం ఏర్పడగలవో ఆలోచించండి. ధనికుడూ, పేదవాడూ ఒకేపనిని చేసినప్పుడు, దానివల్ల వారిద్దరిమధ్య ఏర్పడగల స్నేహసంబంధంద్వారా తారతమ్యాలు తొలగిపోయి ఎంత సమత్వం వస్తుందో ఆలోచించండి.

ఈ విధంగా ఉత్పత్తి చేయబడిన నూలును మూడు విధాలుగా ఉపయోగించవచ్చును. (1) పేదవారికిగాను ఆ నూలును చరఖాసంఘానికి ఇచ్చివేయుట, (2) స్వంతంగా ఉపయోగించుకొనుటకు గాను దానిని నేయించుకొనుట. (3) ఆ నూలుకు తగిన విలువగల ఖాదీని కొనుక్కొనుట. నూలు ఎంత సున్నితంగానూ, నాణ్యమైనదిగానూ ఉంటుందో దానికి అంత ఎక్కువ విలువ ఉంటుంది. అందుచేత కాంగ్రెసు వారు హృదయపూర్వకంగా ఈ పనిలో నిమగ్నమైతే ఈ పని ముట్లను బాగుగా అభివృద్ధి చేయగలరు; క్రొత్త పనిముట్లను కనుగొనగలరు. మనదేశంలో తెలివితేటలకు శరీరశ్రమకు మధ్య

అఘాతం ఏర్పడిఉంటూ వచ్చింది. దానిఫలితంగా జీవితం జడతుల్యమైంది. ఇంతవరకూ నేను చెప్పినవిధంగా ఈ రెంటిమధ్య విడదీయరాని కలయిక ఏర్పడితే దానివల్ల రాగల మంచి అసమానమైన దౌతుంది.

సేవాభావంతో దేశవ్యాపితంగా జరగవలసిన ఈ నూలు వడుకు కార్యక్రమమునకు సాధారణ ప్రజలైన స్త్రీ పురుషులు రోజుకు ఒక గంటకంటె ఎక్కువ సమయం వెచ్చించవలసిన అవసరం లేదు.

---

# 5 ఇతర గ్రామపరిశ్రమలు

ఖాదీకీ వీటికీ తేడా ఉంది. వీటిలో ఐచ్ఛికమైన శ్రమకు ఎక్కువ అవకాశం లేదు. ప్రతీ పరిశ్రమ కొంతమందికి మాత్రమే పనికల్పిస్తుంది. ఈ పరిశ్రమలు ఖాదీకి సహాయకారిగా ఉంటాయి. ఖాదీ లేకపోతే అవి మనలేవు. అవి లేకపోతే ఖాదీకి ప్రతిష్ఠ ఉండదు. విసరడం, దంచడం, సబ్బు పరిశ్రమ, కాగితం పరిశ్రమ, అగ్గిపుల్లల పరిశ్రమ, చర్మాలను శుభ్రంచేయుట, నూనె తయారు చేయుట మొదలైన ముఖ్య గ్రామపరిశ్రమలు లేకుండా గ్రామ ఆర్థికవ్యవస్థ సంపూర్ణంకాదు. కాంగ్రెసువారు గ్రామాలలో స్థిరపడి వీనిలో ఉత్సాహము చూపితే ఈ పరిశ్రమలకు ప్రాణం పోసి క్రొత్తరూపం తేగలరు. వీలైనప్పుడూ, వీలైనచోటా గ్రామపరిశ్రమలలో తయారైన వస్తువులనే ఉపయోగించుటను ప్రతివారూ తన మర్యాదకు లక్షణంగా భావించాలి. వాడేవారే కనక ఉంటే, మనకవసరమైన వస్తువులన్నిటినీ గ్రామాలే ఉత్పత్తి చేయగలవనడంలో సందేహం లేదు. గ్రామాలవైపు మనదృష్టిని మరల్చినయెడల పాశ్చాత్య అనుకరణల అవసరమూ ఉండదు; యంత్రాలలో తయారయ్యే వస్తువుల అవసరమూ ఉండదు. అప్పుడు మనం ఒక నూతన జాతీయ దృక్పథాన్ని అలవర్చు కుంటాము. అందులో దారిద్ర్యం, ఆకలి, సోమరితనం లేని నవభారతదేశ మనే ఆశయానికి అనుకూలంగా మన అభిరుచు లను పెంపొందించుకుంటాము.

బుద్ధికీ శ్రమకీ మధ్య ఏర్పడిన అఖాతం యొక్క ఫలితంగా గ్రామాలను విస్మరించుట జరిగింది. దీని పర్యవసానంగా కళకళలాడే పల్లెలకు బదులు దేశ మంతటా గ్రామాలు క్రుళ్ళిపోయి ఉన్నవి. అందుచేత గ్రామాలకు వెళ్ళితే మనకు సంతోషప్రదమైన అనుభవం కలుగుటలేదు. గ్రామాలలోనూ, చుట్టూ పరిసరాలలోనూ మురికీ, దుర్గంధమూ ఎంతగా ఉంటున్నాయంటే గ్రామాల దాపులకు చేరినప్పటినుంచీ కళ్లూ, ముక్కూ మూసుకోవాలని అనిపిస్తుంది. కాంగ్రెసువారే కనుక గ్రామాలనుండి వచ్చినవారే అయితే వారు తమ గ్రామాలను పరిశుభ్రంగా ఉంచగలరు. కాని, కాంగ్రెసువారు దైనందిన జీవితంలో గ్రామీణులతో కలిసిపోవుటను తమ విధిగా ఎప్పుడూ భావించ లేదు. మనం జాతీయ, సాంఘిక పరిశుభ్రతను ఒక మంచి గుణంగా ఎంచనూ లేదు, దానిని అభివృద్ధి పరచనూ లేదు. సాధారణంగా అలవాటు ప్రకారం మనం స్నానమైతే చేస్తాము; కాని ఏ చెరువు గట్టునో బావిప్రక్కనో, నది ఒడ్డునో శ్రాద్ధకర్మలను జరిపి మరల వాటినే మలినం చేయుటకు వెనుదీయం. మన ఈ లోపాన్ని నేను ఒక పెద్ద దుర్గుణంగా భావిస్తున్నాను. దీని వల్లనే మన గ్రామాలు ఇంత అధోస్థితిలో ఉన్నాయి. పవిత్రమైన నదీ తీరాలను, చెరువుగట్లను, మలినం చేసి, వ్యాధులు విస్తరింప జేస్తున్నాము.

---

# 7 నవీన విద్య లేక పునాది విద్య

ఇది ఒక క్రొత్త విషయము. అయినా కాంగ్రెసు కార్య వర్గ సభ్యులకు ఇందులో చాల శ్రద్ధ, కుతూహలము ఏర్పడ్డాయి. దానివల్ల హరిపుర కాంగ్రెసు సమావేశసమయంలో దీనిని అంగీకరిస్తూ అధికార పత్రాన్ని విడుదల చేశారు. అప్పటినుంచీ హిందుస్తానీ తాలిమీ సంఘం పని చేస్తోంది. ఈ నవీనవిద్య కార్యక్షేత్రము చాల విశాలమైనది. ఇందు ఎంతమంది కాంగ్రెసు వారైనా పనిచేయవచ్చును. గ్రామస్థుల పిల్లలను సంస్కరించి వారిని ఆదర్శ గ్రామపౌరులుగా తయారుచేయుట దీని ముఖ్యోద్దేశము. అట్టి పిల్లలను దృష్టిలో పెట్టుకునే ఈ విధానము రూపొందించబడింది. ఇందు కవసరమైన అసలు ప్రేరణ గ్రామాల నుండే లభించింది. స్వరాజ్య సౌధాన్ని పునాదులనుంచీ నిర్మించ దలచిన కాంగ్రెసువారు పిల్లలను ఉపేక్షించ లేరు. విదేశీ పాలకులు, తమకు తెలియకుండానే కావచ్చు. విద్యారంగంలో తమ పనిని పిల్లల చదువుతోనే ప్రారంభించారు. ప్రాథమిక విద్య అనే పేరుతో అమలులో ఉన్న విధానం కేవలం ఒక ఫార్సు. అందులో భారతదేశంలోని గ్రామాల అవసరాలు ఏమీ దృష్టిలో పెట్టుకోబడలేదు; ఆ మాటకువస్తే పట్టణాల గురించికూడ సరిగా యోచింపబడలేదు. భారతదేశంలో ఉండే పిల్లలందరినీ, వారు గ్రామాలలో నివసించినా, పట్టణాలలో నివసించినా,

నవీనవిద్య వారిని భారతదేశంలోని ఉత్తమ తత్వాలకు సన్నిహితంగా చేరుస్తుంది. ఈ విద్యా విధానం బాలబాలికల మనస్సునూ, శరీరాన్నీ వికసింపజేస్తుంది; వారిని తమ భూమాతకు సన్నిహితులుగా చేస్తుంది; వారి ముందు దేశం యొక్క భవ్యమైన భవిష్యత్తును చిత్రిస్తుంది; ఆ చిత్రణ ననుసరించి భావి భారతదేశాన్ని నిర్మించుటకుగాను ప్రతీ బాలుడూ, ప్రతీ బాలికా పాఠశాలకు వెళ్ళడం ప్రారంభించిన దినమునుండీ కూడా తమ జీవిత కార్యక్రమాన్ని నిర్ణయించుకొనుటలో నవీన విద్య తోడ్పడుతుంది. కాంగ్రెసువారికి ఈ నవీన విద్యా కార్యక్రమంలో ఎంతగానైనా ఉత్సాహము, శ్రద్ధ పర్పడగలవు. ఇందు మూలంగా ఏ పిల్లలతో అయితే వారికి సంబంధం ఏర్పడుతుందో ఆ పిల్లలు అభివృద్ధి చెందడమేకాక, అంతగానూ కాంగ్రెసువారి అభివృద్ధికూడా ఈ కార్య నిర్వహణలో జరుగుతుంది. ఈ కార్యక్రమాన్ని ప్రారంభించ దలచుకున్న కాంగ్రెసు వారు, సేవాగ్రాంలోని తాలిమీ సంఘం కార్యదర్శికి వ్రాసి అవసరమైన వివరాలు తెలుసుకోవచ్చును.

---

కాంగ్రెసువారు ఈ విషయాన్ని పూర్తిగా విస్మరించారనే చెప్పవచ్చును. దీనిని విస్మరించక, కొంత పనిచేసినవారు నిరక్షరాశ్యులకు వ్రాయను, చదువను నేర్పుటతోనే సంతృప్తి చెందారు. ప్రయోజనవిద్యే కనుక నా ఆధీనంలో ఉంటే నేను దేశంయొక్క వైశాల్యాన్ని, గొప్పతనాన్ని చెప్పడంతో వారి విద్యను ప్రారంభిస్తాను. మన గ్రామీణుల దృష్టిలో వారి గ్రామమే వారికి పూర్తిదేశము. ఏ గ్రామీణుడైనా మరో గ్రామానికి వెళితే తన మొత్తంగ్రామాన్ని తన ఇల్లుగా భావించి మాట్లాడుతాడు. వారికి 'భారతదేశం' అనేది భూగోళ పుస్తకాలలో ఉండే ఒక శబ్దం మాత్రమే. మన గ్రామాలలో ఎంత అజ్ఞానం వ్యాపించి ఉందో, మనకొక అంచనా లేదు. గ్రామస్తులకు మన దేశాన్ని పరిపాలిస్తున్న విదేశీ ప్రభుత్వంవల్ల కలుగుచున్న దుష్ఫలితాలు, నష్టాలు గురించి తెలియనే తెలియదు. వారికి అచ్చటచ్చటినుండి తెలిసిన విషయాలబట్టి విదేశీయుల భయంకర ప్రవర్తన వారి మనస్సులపై పనిచేస్తుంది. అందుచేత విదేశీయులు, వారిపరిపాలన అంటే గ్రామస్తులు భయపడతారు. అయినా మనస్సులో మాత్రం వారియెడల ఏహ్యాభావం వ్యాపించియుంటోంది. ఈ పరాయి పాలకుల పద్మవ్యూహంనుండి బయట పడడం ఎలాగో వారికి తెలీదు. తమ బలహీనతలు, తమ

లోపాలు కారణంగానే విదేశీయులు ఇక్కడ ఉండి రాజ్యం చేయగలుగుచున్నారనికూడా వారికి తెలీదు; అలాగే ఈ విదేశీ పాలన అనే రాక్షసిని వెళ్ళగొట్టేశక్తి తమలోనే ఉందనికూడా వారికి తెలీదు. కనుక వయస్సువచ్చిన వయోజనులకు చదువు చెప్పడం అంటే సూటి సంభాషణలద్వారా వారికి సరియైన రాజకీయస్థితిని తెలియజెప్పడం అని నేను అర్థం చెబుతున్నాను. ఈ శిక్షణ ఏవిధంగా గరపాలి అనే విషయమై ముందుగానే ఒక ప్రణాళికను సిద్ధంచేసుకుంటే ఆపైన నిర్భయంగా చెప్పవచ్చును. ఇలాంటిపని మనంచేస్తే ప్రభుత్వోద్యోగులు జోక్యంకలిగించుకుని మనలను ఆపని చేయకుండా ఆపవచ్చును. అయినా మన సోదరులకు సూటిగా యథార్థ రాజకీయ పరిస్థితులను తెలియజెప్పే మన ప్రాథమిక హక్కును, పోరాడి అయినా సాధించుకోవలసిందే. ఎందుకంటే ఈ ప్రాథమిక హక్కును సంపాదించుకోలేకపోతే స్వరాజ్యంకూడా రాదు. ఈ విషయమై నేనిక్కడ ఉల్లేఖించినదంతా బహిరంగంగా జరగాలనుటలో ఏమాత్రమూ సందేహం లేదు. అహింసాయుత విధానములో భయానికి వీసమంతైనా స్థానంలేదు; కనుక రహస్యానికీ స్థానంలేదు. నోటిమాటద్వారా గరిపే ఈ విద్యతోపాటు వ్రాయను, చదవను కూడ నేర్పడం కొనసాగుతుంది. దీనికొక విశిష్టత ఉన్నది. ఈ విధానంలో చదువునేర్పే సమయాన్ని వీలైనంత తగ్గించుటకు చాల విధానాలు పరీక్షింపబడుతున్నాయి. కాంగ్రెసు కార్యవర్గం ఈ విషయంలో నిపుణులతో ఒక ఉపసంఘాన్ని నియమించి, నేనిక్కడ చెప్పిన విషయాలను ఆ ఉప

సంఘం పరిశీలించి కార్యకర్తలకు ఒక స్పష్టమైనదారి చూపునట్లు చేయవచ్చును. నే నీ అంశంలో చెప్పిన విషయాలు కేవలం సూచన ప్రాయంగానే ఉన్నాయిగాని, సాధారణ కాంగ్రెసు కార్యకర్తకు ఈ పనిని చేసేవిధానం చూపబడలేదని నేనంగీకరిస్తాను. ప్రతీ కాంగ్రెసువాది ఈ పని చేయలేడు. ఇది ఒక ప్రత్యేకమైనపని. అయితే అధ్యాపకులైన కాంగ్రెసువారు ఇక్కడ సూచింపబడిన సూచనల ననుసరించి ఒక కార్యక్రమాన్ని ఏర్పరచుకోగలగడం అంత కష్టంకాదు.

---

## 9 స్త్రీలు

ఇంతవరకూ అంధకార కూపంలో చిక్కుకొనియున్న భారతీయ స్త్రీలను సత్యాగ్రహ విధానం పైకి తీసుకువచ్చింది. ఇంత తక్కువ సమయంలో మరి ఏ ఇతర విధానంవల్లనూ స్త్రీలు ఇలా అభివృద్ధి చెందలేదు. అయినప్పటికీ స్త్రీ సేవా కార్యక్రమాన్ని నేను ఈ నిర్మాణ కార్యక్రమంలో చేర్చాను. ఎందుకంటే పురుషులతోపాటు సమానస్థాయిలో స్త్రీలుకూడా స్వాతంత్ర్యసమరంలో పాల్గొనుటకు కల్పించవలసిన అవకాశాల గురించి ఇంకా కాంగ్రెసువారు తమ మనసులను స్పష్టం చేసుకోలేదు. సేవాకార్యమందు పురుషునికి సహాయంచేసే నిజమైన సహచరిణిగా స్త్రీ కావాలని కాంగ్రెసువారు ఇంకా అంగీకరించుటలేదు. ఏ ఆచారాలు, అలవాట్లు, శాసనాలు అయితే పురుషులచే మాత్రమే తయారు చేయబడినవో, వాటిని తయారు చేయుటయందు స్త్రీలు పాల్గొనలేదో, ఆ యా ఆచారాలు, అలవాట్లు, శాసనాలు స్త్రీలను సదా అణచివేస్తూ వస్తున్నాయి. అహింసను ఆధారం చేసుకుని రచింపబడే జీవిత విధానంలో పురుషునకు తన భవిష్యత్తును నిర్ణయించుకునే అధికారం, స్వాతంత్ర్యం ఉన్నట్లుగానే స్త్రీకి కూడా తన భవిష్యత్తును నిర్ణయించుకునే అధికారము, స్వాతంత్ర్యమునే ఉంటాయి. అయితే అహింసాయుత సాంఘిక వ్యవస్థలో లభించే అధికారాలు

కొన్ని కర్తవ్యాలను, ధర్మాలను పాలించుటవల్ల లభిస్తాయి. అందుచేత సాంఘిక ఆచార వ్యవహారాలను, నియమాలను స్త్రీ పురుషు లిద్దరూ కలిసి ఇద్దరికీ అంగీకారయోగ్యంగా నిర్ణయించుకోవాలి. ఈ నియమాలను, బయటనుంచి బలవంతమైన వత్తిడిచేగాని, ప్రభుత్వ ఆజ్ఞచేగాని అనుసరింప చేయలేరు. పురుషులు స్త్రీల యెడల వ్యవహరించవలసిన తమ ఆచరణ గురించి ఈ సత్యాన్ని ఇంకా పూర్తిగా గుర్తించలేదు. స్త్రీని తన స్నేహితురాలిగానూ, సహచరి గానూ చూచేబదులు పురుషుడు, ఆమెకు తాను యజమాని అనుకుంటున్నాడు. భారతదేశంలోని స్త్రీలు అభివృద్ధి చెందుటకు సహాయపడడం కాంగ్రెసువారికి గౌరవపూర్వకమైన కర్తవ్యము. పూర్వకాలంలోని బానిసలకు తాము స్వతంత్రులు కావాలని గాని, కాగలమనిగాని తెలీదు. స్త్రీల పరిస్థితి ఇప్పుడు అలాగే ఉంది. ఆ బానిసలు స్వాతంత్ర్యం పొందినప్పుడు తాత్కాలికంగా వారికి తమ ఆసరా పోగొట్టుకుంటున్నట్లు అనిపించింది. తాము పురుషుల దాసీలమని భావించుకోవాలని స్త్రీలకు నేర్పడం జరిగింది. కనుక స్త్రీలకు వారి యథార్థపరిస్థితులను తెలియజేసి, జీవితంలో వారు పురుషులతో సమానస్థాయిలో వ్యవహరించ గలుగునట్లు వారికి శిక్షణ ఇవ్వడం కాంగ్రెసువారి కర్తవ్యము.

ఒకసారి మనస్సులో నిశ్చయంచేసుకుంటే ఈ విప్లవ కార్యం తేలిక అవుతుంది. కనుక కాంగ్రెసువారు తమ గృహములనుండే ఈ పనిని ప్రారంభించాలి. వారు తమ భార్యలను వినోదం కలుగజేయు బొమ్మలుగాను, భోగవిలాసవస్తువులు

గాను ఎంచక, సేవాకార్యంలో తనతోపాటు పనిచేయు గౌరవనీయమైన భాగస్వామినులుగా ఎంచవలెను. ఇందుకుగాను పాఠశాలలలో చదువుకొనని స్త్రీలు తమ భర్తలవద్ద వీలైనంత వరకూ చదువు నేర్చుకోవాలి. భార్యల విషయంలో చెప్పిన వాటినే తల్లులు, కుమార్తెల విషయంలోకూడ అవసరమైన మార్పులతో వర్తింపజేసుకోవాలి.

భారతీయస్త్రీల దుస్థితిని చిత్రించుటలో నేను ఒకవైపే చెప్పాననడంలో సందేహంలేదు. గ్రామాలలో స్త్రీలు కొన్ని చోట్ల పురుషులతో సమానంగానూ, కొన్ని సందర్భాలలో వారికంటె ఎక్కువగానూ ఉండి పురుషులపై అధికారం చలాయించుటా లేకపోలేదు. అయితే నిష్పక్షపాత దృష్టితో బయట నుంచి చూచేవారికి ఆచార వ్యవహారాలరీత్యానూ, చట్టం రీత్యానూ స్త్రీల స్థితి చాలా దుస్సహమైనదనీ, విప్లవాత్మక మార్పులు లేక తప్పదనీ గోచరిస్తుంది.

---

ఈ నిర్మాణ కార్యక్రమంలో గ్రామపారిశుద్ధ్యానికి స్థానం కల్పించినతర్వాత ప్రత్యేకంగా ఆరోగ్యనియమాల శిక్షణను ఒక అంశంగా చేర్చవలసిన అవసరం ఏమిటని కొందరికి అనుమానం కలగవచ్చును. కలపాలనుకుంటే దీనిని గ్రామపారిశుద్ధ్యములో కలపవచ్చును. కాని, నిర్మాణ కార్యక్రమంయొక్క వేరు వేరు అంశాలను ఒకదానిలో మరొకటి కలపడం నాకిష్టంలేదు. కేవలం గ్రామపారిశుద్ధ్యం అంటే అందులో ఆరోగ్యనియమాల శిక్షణప్రసక్తి రాదు. తనశరీరాన్ని జాగ్రత్తగా కాపాడుకోవడం, ఆరోగ్యనియమాలను తెలుసుకోవడం ప్రత్యేక విషయం అభ్యాసముతోనూ, అభ్యాసముద్వారా పొందిన జ్ఞానాన్ని ఆచరించుట తోనూ దీనికి సంబంధం ఉంటుంది. సువ్యవస్థితమైన సమాజంలో నివసించేవారు ఆరోగ్యసంబంధమైన నియమాలను తెలుసుకొని, వాటిని ఆచరిస్తూ ఉంటారు. మానవజాతిని పీడించే రోగాలలో ఎక్కువ రోగాలు ఆరోగ్యనియమాలు సరిగా తెలియకపోవడం చేతనూ, వాటిని సరిగా అమలు జరుపకపోవడంచేతనూ వస్తున్నాయనే విషయం ఇప్పుడు స్పష్టమైంది. ఇతరదేశాలకంటే మనదేశంలో మరణాలు ఎక్కువగా ఉండుటకు కారణం, మన దేశవాసుల ఎముకలను కొరుక్కుతింటున్న దారిద్ర్యం కారణ మైనప్పటికీ వారికి ఆరోగ్యనియమాల గురించి సరియైన శిక్షణ నిస్తే మరణాల సంఖ్యను కొంతవరకైనా తగ్గించవచ్చును.

మానవుని ఆరోగ్యానికి సర్వసాధారణమైన మొదటి నియమం 'మనస్సు ఆనందంగా ఉంటే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది' అనేది. రోగరహితమైన శరీరంలో నిర్వికారమైన మనస్సు ఉంటుందనేది సర్వసామాన్యమైన విషయం. మనస్సుకు శరీరానికి మధ్య విడదీయరాని సంబంధం ఉంది. మన మనస్సు కనుక ఆహ్లాదకరంగానూ, నిర్వికారంగానూ ఉంటే అన్నిరకాల హింసనుండి విముక్తిచెంది, మన చేతలలో సహజంగానే ఆరోగ్య నియమాలను పాటించడం జరుగుతుంది. అప్పుడు ప్రత్యేకమైన ప్రయత్నం అవసరంలేకుండానే శరీరం ఆరోగ్యవంతంగా ఉంటుంది. ఈ కారణాలవల్ల నిర్మాణ కార్యక్రమంలోని ఈ అంశంయెడల ఏ కాంగ్రెసువాదికూడ అశ్రద్ధగా ఉండబోరని ఆశిస్తున్నాను. ఆరోగ్యశాస్త్ర నియమాలు చాల సరళమైనవి. వాటిని తేలికగా నేర్చుకొనవచ్చును. కాని, వాటిని ఆచరించుట మాత్రం కొంత కష్టము. ఈ క్రింద అలాంటి కొన్ని నియమాలను ఇస్తున్నాను :

ఎల్లప్పుడూ పవిత్ర ఆలోచనలనే కలిగి ఉండాలి. చెడు భావనలను ఎప్పుడూ మనస్సులోనికి రానీయరాదు.

రాత్రింబవళ్లు స్వచ్ఛమైన గాలిని పీల్చాలి.

శరీర, మానసిక శ్రమలు సమంగా ఉండునట్లు చూడాలి. వాటిలో ఒకటి మరీ ఎక్కువ, ఒకటి మరీ తక్కువ కాకుండా చూచుకోవాలి.

నడుంవిరిచి తిన్నగా నించోవాలి. అలాగే తిన్నగా కూర్చోవాలి. ప్రతిపనినీ శుభ్రంగానూ చక్కగానూ చేయాలి.

ఈ అలవాట్లన్నిటినీ అంతరంగిక ఆరోగ్యానికి ప్రతిబింబాలుగా చేసుకోవాలి.

తనవంటి ఇతర మానవసోదరుల సేవ చేయగలుగుటకు గాను ఆహారం భుజించాలి. అంతేగాని భోగలాలసతతో భుజించాలనీ, జీవించాలనీ భావించరాదు. కనుక మనస్సు, శరీరము సరియైన స్థితిలో ఉండుటకు, సరిగా పనిచేయుటకు అవసరమైనంత మాత్రమే భుజించాలి. ఆహారాన్నిబట్టి మానవ నిర్మాణం జరుగుతుంది.

త్రాగేనీరు, తినే ఆహారం, పీల్చేగాలి - అన్నీ శుభ్రంగా ఉండాలి. మీరు కేవలం మీ శరీర శుభ్రతనే చూచుకుంటే చాలదు. గాలి, నీరు, ఆహారం శుభ్రంగా ఉంచుకోవడమే కాక ఇరుగు పొరుగు వాతావరణాన్ని కూడా పరిశుభ్రంగా ఉంచుకోవాలి.

---

## 11 ప్రాంతీయ భాషలు

మనం మన మాతృభాషలకంటెకూడ ఎక్కువగా ఇంగ్లీషును ప్రేమించిన కారణంగా చదువుకొని, రాజకీయ చైతన్యం పొందిన వారికీ సామాన్య ప్రజానీకానికీ మధ్య పెద్ద అంతరం ఏర్పడింది ఈ కారణంగానే భారతీయ భాషలు దిగజారిపోయాయి. లోతైన తాత్విక విషయాలను, భావగర్భితమైన ఆలోచనలను మాతృభాషలో వ్యక్తీకరించాలని చేసే ప్రయత్నం సాధారణంగా విఫలమౌతూ ఉంటుంది. మనకు శాస్త్రీయ పారిభాషిక శబ్దాలు లేవు. దీని ఫలితం చాల విచారకరంగా తేలింది. మన ప్రజానీకం ఆధునిక భావాలనుండి, ఈ నూతన యుగపు ఆలోచనలనుండి దూరమై పోయింది. గొప్పవైన భారతీయ భాషలను విస్మరించుటచేత భారత దేశానికి జరిగిన నష్టాన్ని మనం ఇప్పుడే అంచనా వేయలేము. ఎందుచేతనంటే ఆ కాలానికి మనం ఇంకా దగ్గరగా ఉన్నాము. అయితే ఒక విషయాన్ని మాత్రం స్పష్టంగా తెలుసుకోవాలి. ఇంతవరకు కలిగిన నష్టాన్ని, జరిగిన హానిని పూడ్చుకొనుటకు మనం ప్రయత్నించకపోతే సాధారణ ప్రజానీకంయొక్క మనస్సుకు విముక్తిరాదు దాని ఫలితంగా స్వరాజ్యాన్ని నిర్మించుటలో ప్రజ ఏపనీ చేయజాలరు. అహింసపై ఆధారపడిన స్వరాజ్యమందు ప్రతీవ్యక్తికూడ సూటిగా స్వాతంత్ర్య సమరమందు పాల్గొని తన భాగం కర్తవ్యాన్ని

నిర్వహించాలి. ప్రతీ మెట్టునీ, ప్రతీ దశనూ దానిలోని వివ రాలతో సహా ప్రజలు స్పష్టంగా అర్థం చేసుకుంటేనేగాని, ప్రజలు తమ కర్తవ్యాన్ని నిర్వహించ లేరు. ప్రతీ మెట్టూ, ప్రతీ దశ వారి మాతృభాషలో అర్థమయ్యేట్లు వారికి చెబితేనే గాని వారు వివరాలు అర్థం చేసుకోవడం సాధ్యంకాదు.

---

భారత దేశం అంతటితోనూ వ్యవహారించుటకుగాను భారతీయ భాషలనుండి ఒక భాషను మనము ఎంచుకొనవలసి యుంది. అయితే ఆభాష ఇప్పటికే హెచ్చుమంది వాడుతూ ఉన్న భాషై, దానిని ఇతరులు తేలికగా నేర్చుకొనుటకు వీలైన భాషై ఉండాలి. హిందీయే అట్టి భాష అని చెప్పుటకు సందేహము లేదు. ఉత్తర భారత దేశంలోని హిందువులు, మహమ్మదీయులు ఇద్దరూ దీనిని మాట్లాడుతున్నారు. ఈ భాషే ఉర్దూ లిపిలో వ్రాయబడితే ఉర్దూ అనబడుతోంది. 1925 లో కాన్పూరులో జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభలో ఈ భాషనే హిందుస్తానిగా పేర్కొంటూ చారిత్రాత్మకమైన తీర్మానం చేయబడింది. అప్పటినుంచీ కనీసం సిద్ధాంతరీత్యానే అయినా హిందుస్తానీ రాష్ట్రభాషగా అంగీకరించబడింది. 'సిద్ధాంతరీత్యా' అనే పదం నేను బుద్ధి పూర్వకంగానే ప్రయోగించాను. ఎందుచేతనంటే కాంగ్రెసువారుకూడా దీనిని ఉపయోగించవలసినంతగా ఉపయోగించలేదు. భారత దేశంలోని సాధారణ ప్రజానీకానికి రాజకీయ విద్య గరపుటకొరకు భారతీయ భాషల ప్రాముఖ్యతను గుర్తించి అంగీకరించే ప్రయత్నం తొలుత 1920 లో చేయబడింది. దాని ననుసరించే మరొక ప్రయత్నంకూడా చేయబడింది. రాజకీయంగా మేల్కొన్న

భారతీయులు తేలికగా అర్థం చేసుకోగల, మాట్లాడగల భారతీయ భాష ఒకటి భారతదేశం మొత్తానికి వర్తింపజేయాలి. జాతీయ కాంగ్రెసు మహాసభలు జరిగినప్పుడు భారతదేశంలోని వివిధ ప్రాంతాలనుండి వచ్చే కాంగ్రెసువారు ఆ భాషను అర్థం చేసుకోగలగాలి. మన మందరం ఈ రాష్ట్రభాషను దీని రెండు శైలులను అర్థంచేసుకొని, మాట్లాడ గలుగునట్లును, రెండు లిపులలోనూ వ్రాయగలుగునట్లును నేర్చుకోవాలి.

చాలమంది కాంగ్రెసువారు ఈతీర్మానాన్ని ఆచరణలో పెట్టలేదని చెప్పుటకు నేను చాల విచారిస్తున్నాను. దీని ఫలితంగా నేటికికూడా ఇంగ్లీషులో మాట్లాడేవారినీ, తాము అర్థం చేసుకొనుటకుగాను ఇతరులను ఇంగ్లీషులో మాట్లాడమని బలవంత పెట్టేవారినీ మనం చూస్తున్నాము. నా దృష్టిలో ఇది మనం సిగ్గుపడవలసిన విషయం. ఇంగ్లీషు భాషపై ఏర్పడిన వ్యామోహ ప్రభావంనుండి మనం ఇంకా బయటపడలేదు. ఈ వ్యామోహంలో చిక్కుకుని భారతదేశం తన లక్ష్యంవైపు పురోగమించకుండా మనం అడ్డుతగులు తున్నాము. ఇంగ్లీషు ఎన్నిసంవత్సరాలు వృధాగా ఖర్చుపెడుతున్నామో హిందీ నేర్చుకొనుటకు మనం ప్రయత్నించకపోతే సాధారణ ప్రజానీకం యెడల మనకు కలదని చెప్పుకునే ప్రేమ నామమాత్రమైనదే అవుతుంది.

# 13 ఆర్థిక సమానత

అహింసాయుత స్వరాజ్యమునకు ఆర్థికసమానత మూల సూత్రము. ఆర్థిక సమానతకై కృషిచేయుట అనగా యజమానులకు కూలీలకు మధ్యగల నిరంతర పోరాటమును నిర్మూలించుట. ఒకవైపు దేశముయొక్క ఆర్థిక సంపదను గుప్పిట్లో పెట్టుకున్న కొద్దిమంది ధనికులను క్రిందకుదింపి, మరొకవైపు అర్ధాకలితో వస్త్ర విహీనంగా ఉన్న లక్షలాది ప్రజలను పైకి లేవనెత్తుటే ఆర్థిక సమానతయొక్క అర్థము. ఆకలితో అలమంటించే ప్రజానీకానికి ధనికులకు మధ్య పెద్ద తేడా ఉన్నంత వరకూ అహింసతో కూడుకున్న ప్రభుత్వం ఏర్పడుట నిస్సందేహముగా అసాధ్యమైన విషయం. ధనికులూ పేదలూ సమాన ఆధిక్యతలను అనుభవించు స్వతంత్ర భారతదేశములో ఢిల్లీలోని రాజభవనములకు, వాటిప్రక్కనే ఉన్న పేదల కూలిపోయే గుడిసెలకు మధ్యగలతేడా ఒక్క నిముషమైనను నిలువలేదు. ధనమును, దానివల్లవచ్చు ఆధిక్యతలను ఐచ్ఛికంగా వదలివేసి, సామాజిక సౌఖ్యంలో సమభాగులు కాకపోతే, దౌర్జన్యము రక్తపాతముతోకూడిన విప్లవము ఏదో ఒకరోజున తప్పదు.

ధర్మకర్తృత్వ విధానమును ఇతరులు ఎంత అపహాసించినా, నేను దానిని అంటిపెట్టుకునే ఉన్నాను. దానిని అనుసరించుట కష్టమనుట నిజమే. అహింసకూడా అంతే. అయితే

అహింసను సాధించుటకు 1920 లో మన మనస్సులను నిశ్చయం చేసుకున్నాము. ప్రయత్నమునకు తగిన ఫలమును మనం పొందాము. అహింసా కార్యక్రమముల అభివృద్ధిని అనుక్షణము గుర్తించుట దీనికి అవసరము. అహింసయొక్క అవసరాన్ని అర్థంచేసుకొనుటకు కాంగ్రెసు కార్యకర్తలు నిరంతరం అన్వేషిస్తారని ఆశిస్తున్నాను. ప్రస్తుతం అమలులో ఉన్న అసమానతలు హింసావిధానంవల్ల పోవలెనా, అహింసావిధానంవల్ల పోవలెనా అని వారు ప్రశ్నించుకోవాలి. హింసావిధానం మనకు తెలిసిందే. అది ఎక్కడా నెగ్గలేదు.

ఈ అహింసా పరిశోధన ఇంకా ప్రారంభదశలోనే ఉంది. ప్రదర్శించి చూపాలంటే మనవద్ద ఎక్కువ ఏమీలేదు. అయినప్పటికీ నెమ్మదిగానైనాసరే సమానత్వంవైపు అహింసావిధానం పని ప్రారంభించిందనుట మాత్రము నిశ్చయము. అహింసా విధానం అంటే ఇతరులను మార్చుట. కనుక ఒకసారి మార్పు వస్తే ఆ మార్పు స్థిరంగా ఉండిపోతుంది. అహింసతో నిర్మింపబడ్డ దేశము బయటనుంచిగాని, లోపలనుంచిగాని వచ్చే దెబ్బలను తట్టుకోగలుగుతుంది. కాంగ్రెసు సంస్థలో ధనవంతు లున్నారు. వారు ముందుగా దారితీయాలి. ప్రతీ కాంగ్రెసువాది లోతుగా ఆలోచించుకొనుటకు ఈ పోరాటము ఒక అవకాశాన్ని కల్పిస్తోంది. ఎప్పటికైనా మనం సమానత్వం సాధించాలనుకుంటే అందుకు పునాదులు ఇప్పటినుంచే వేయాలి. స్వరాజ్యం వచ్చిన తర్వాత ఏవో పెద్ద మార్పులు రాగలవని ఊహించేవారు, అహింసాయుత స్వరాజ్యంయొక్క మూలసూత్రాలు కూడ

తెలియక పొరబడుతున్నారని చెప్పవలసి ఉంటుంది. అకస్మాత్తుగా ఆకాశంనుంచి ఒకరోజున స్వరాజ్యం ఊడిపడదు. సుసంఘటితమైన స్వయంకృషితో దానిని నెమ్మది నెమ్మదిగా నిర్మించుకు రావాలి. ఇప్పటికే ఆ దారిన కొంతదూరం వెళ్ళాము. అయితే స్వరాజ్యంయొక్క ప్రకాశవంతమైన ప్రతిభను చూడాలంటే ఇంకా మనం చాలదూరం ప్రయాణించాలి. "ఆర్థిక సమానత స్థాపించుటకై నేనేమి చేశాను ?" అని ప్రతి కాంగ్రెసువాది తనను తాను ప్రశ్నించుకోవాలి.

---

ఈ నిర్మాణ కార్యక్రమంలో అన్ని విషయాలూ చేర్చుటకు వీలుపడలేదు. స్వరాజ్యసౌధం చాల గొప్పది. దాని నిర్మాణంలో 80 కోట్ల చేతులూ పనిచేయాలి. వీరిలో వ్యవసాయం చేసే రైతులసంఖ్యే హెచ్చు. వీరే హెచ్చుమంది, అంటే సుమారు నూటికి 80 మంది, ఉండడంవల్ల యథార్థానికి రైతులే కాంగ్రెసు కావాలి. కాని నేటిస్థితి అలాలేదు. రైతులకు తమ అహింసాత్మక శక్తియొక్క విలువ తెలిసినప్పుడు ప్రపంచంలోని ఏ శక్తీ వారిని అడ్డగించలేదు.

అధికార రాజకీయపు చెత్తుగడలలో వారిని ఉపయోగించరాదు. వారిని ఈ విధంగా అనుచితంగా ఉపయోగించడం అహింసా విధానానికి వ్యతిరేకమని నేననుకుంటాను. రైతులను సమీకరించి రైతు ఉద్యమాన్ని నిర్మించుటకు నా విధానం ఏమిటో తెలుసుకోవాలనుకునేవారు చంపారన్ సత్యాగ్రహ సమరాన్ని అధ్యయనం చేస్తే బాగుంటుంది. భారతదేశంలో తొలిగా చంపారన్‌లోనే సత్యాగ్రహం ప్రయోగించబడింది. దానివల్ల ఎంతటి సత్ఫలితాలొచ్చాయో భారతదేశమంతకూ తెలుసు. చంపారన్ ఉద్యమం ప్రజాఉద్యమమైంది ; మొదటినుంచి చివరివరకూ అది అహింసాయుతంగానే సాగింది. ఆ ఉద్యమంతో సుమారు 20 లక్షలమంది రైతులకు సంబంధం ఉండెను. ఒక శతాబ్దంగా వస్తున్న కష్టాన్ని తొలగించుటకుగాను ఆ ఉద్యమం ప్రారంభించ బడింది. ఈ కష్టాన్ని తొలగించుకొనుటకుగాను

అంతకుముందు ఎన్నో హింసతోకూడిన తిరుగుబాట్లు జరిగాయి. అప్పుడు రైతులు అణచివేయబడ్డారు. కాని అహింసాయుత విధానం ఆరునెలల్లో పూర్తిగా విజయవంతమైంది. ఏరకమైన ప్రత్యక్ష ప్రయత్నం లేకుండానే చంపారన్ ప్రజలు రాజకీయంగా చైతన్యవంతులయ్యారు. వారికష్టాన్ని తొలగించుటలో అహింస ఎలా సమర్థవంతంగా పనిచేసిందో వారు ప్రత్యక్షంగా చూశారు. దానివల్ల వారు జాతీయ కాంగ్రెసులో చేరి బాబూ వ్రజకిశోర్ ప్రసాద్, బాబూ రాజేంద్రప్రసాద్ గార్ల నాయకత్వాన సత్యాగ్రహ సమరాల్లో పాల్గొని తమ పూర్తిశక్తిని వినియోగించారు.

ఇదేకాక ఖేడా, బార్డోలీ, బోర్సాద్ లలో సాగిన రైతు ఉద్యమాలను అధ్యయనంచేస్తే పాఠకులకు లాభిస్తుంది. రైతులను, వారు స్వయంగా అనుభవిస్తున్నకష్టాలను తొలగించుటకు కాక, వేరే రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించకుండా ఉండుటలోనే రైతుఉద్యమాల విజయంయొక్క రహస్యం ఇమిడి ఉంది. రైతులు అర్థంచేసుకొని, బాధపడుతున్న ఏదో ఒక కష్టానికి చుట్టూ ఉద్యమాన్ని సంఘటితపరచాలి. వారికి అహింసపై ధర్మోపన్యాసా లివ్వవలసిన అవసరం లేదు. తమ కష్టాలను తీర్చే సాధనంగా రైతులు అహింసను ఉపయోగించుకునేట్లు ముందుచేసి, ఆపైన వారికి తాము ఉపయోగించిన పద్ధతే అహింసాపద్ధతి అని తెలియజెప్పితే, అహింసను వారు తేలికగా అర్థంచేసుకుంటారు.

రైతులలో పనిచేయడం ఎలాగో తెలుసుకోవాలని అభిలాష గల కాంగ్రెసువారు పైన వివరించిన ఉదాహరణ

లను అధ్యయనం చేయగలరు. రైతులను సంఘటితపరచుటకు గాను కొందరు కాంగ్రెసువారు అవలంబించిన విధానాలు రైతులకు ఏమీ మేలు చేకూర్చకపోగా, వారికి నష్టంకూడా కలుగజేశాయని నేననుకుంటాను. ఏమైనప్పటికీ వారు అహింసా యుత విధానాన్ని మాత్రం ఉపయోగించలేదని చెప్పవలసి యుంది. కార్యకర్తలలో కొందరు తమకు అహింసాయుత విధానంలో నమ్మకంలేదని స్పష్టంగా అంగీకరిస్తూ ఉంటారు. అలాంటివారికి నా సలహా ఏమంటే, వారు కాంగ్రెసు పేరును తమ కార్యక్రమానికి ఉపయోగించకూడదు. ఆ పనిని కాంగ్రెసు కార్యకర్తలుగా వారు చేయరాదు.

అఖిలభారత స్థాయిలో రైతులను, కార్మికులను సంఘటితపరచాలనే పోటీనుండి నేను ఎందుకు దూరంగా ఉన్నానో పాఠకులకు ఈపాటికి అర్థమై యుంటుందనుకుంటాను. మనం అందరం కలిసి ఒకే గమ్యంవైపు ప్రయాణిస్తే ఎంత బాగుం టుంది! అయితే మనదేశంవంటి విశాలదేశంలో ఇది అసాధ్యము. దాని నలా వదిలేద్దాం. అహింసాయుత విధానంలో ఎవరూ ఎవరినీ బలవంతపెట్టరాదు. ప్రత్యక్షాచరణవల్ల వచ్చే ఫలితాలు, తర్కంవల్ల నిరూపితమైన విషయాలు అహింస అభివృద్ధికి తోడ్పడతాయి.

కార్మికులవలెనే రైతుల సమస్యనుకూడ తీసుకొని పని చేయుటకు కాంగ్రెసు తన పర్యవేక్షణలో ఒక ప్రత్యేక శాఖను ప్రారంభించాలని నేననుకుంటున్నాను.

---

## 15 కార్మికులు

అహ్మదాబాదు కార్మికసంఘం మొత్తం భారత దేశానికి అనుకరించదగు ఆదర్శము. అది పరిశుద్ధమైన, సరళమైన, అహింసా యుత పునాదులపై నిర్మించబడింది. ఇంతవరకూ ఆ సంఘానికి వెనుకడుగు వేయవలసిన అవసరం రాలేదు. ఏ విధమైన ఆడం బరము, గొడవలు లేకుండా ఆ సంఘం అభివృద్ధి చెందింది. ఆ సంఘానికి, స్వంత ఆస్పత్రి, కార్మికుల పిల్లలకు చదువుచెప్పుటకు స్వంత పాఠశాలలు, వయోజన పాఠశాల, స్వంతఖాదీభండార్, స్వంత ముద్రణాలయము ఉన్నాయి. అంతేకాక సంఘం కార్మి కులకు మంచి గృహవసతినికూడ ఏర్పరచింది. రమారమి కార్మికు లందరూ ఓటర్లుగా చేరారు. దగ్గరదగ్గర అందరూ తమ ఓటు హక్కును వినియోగిస్తారు. జాతీయకాంగ్రెసు, ప్రాంతీయ సంఘం ప్రోత్సాహంపై వీరందరూ ఓటర్లుగా చేరారు. అయితే ఈ కార్మికసంఘం కాంగ్రెసుయొక్క పార్టీ రాజకీయాలలో పాల్గొనలేదు. పట్టణ పురపాలకసంఘం నిర్ణయాలు ఈ సంఘం యొక్క ప్రభావాన్ని అనుసరించి జరుగుతాయి. ఈ సంఘం ఇంతవరకూ చాల సమ్మెలను విజయవంతంగా చేయించింది; అయితే అన్నీ పూర్తిగా అహింసాయుతంగానే జరిగాయి. ఇచ్చటి కార్మికులు, యజమానులుకూడ పూర్తి అంగీకారంతో ఐచ్ఛికంగానే మధ్యవర్తితీర్పులు అంగీకరించి తమ తగాయిదాలు

బాపుకునేవారు. నేనే కనుక నిర్ణయం చేయవలసివస్తే దేశం లోని అన్ని కార్మిక సంస్థలూ అహ్మదాబాదు కార్మిక సంఘం యొక్క విధానాన్ని అనుసరించేలా చేస్తాను. అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో అనవసరంగా జోక్యం కల్పించు కోవాలని ఈ సంఘం ఎప్పుడూ ప్రయత్నించలేదు; అలాగే ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రభావానికి తానెప్పుడూ లోను కాలేదు. అయితే ఒకప్పుడైనా అహ్మదాబాదు కార్మిక సంఘం విధానాలను అ. భా. ట్రేడ్ యునియన్ కాంగ్రెసు అనుసరిస్తుందనీ, అహ్మదాబాద్ సంఘం అ. భా. ట్రేడ్ యూని యన్ శాఖగా మారగలదనీ నేను ఆశిస్తున్నాను. నేనేమీ తొందరపడడంలేదు. సహజమైనదారిలో అట్టిపరిణామం త్వర లోనే రాగలదు.

---

రానీపరజ వలెనే ఆదివాసి అనే శబ్దంకూడ క్రొత్తగా తయారు చేయబడింది. రానీపరజకు ముందు కాలీపరజ అనే శబ్దాన్ని ఉపయోగిస్తూ ఉండేవారు. (కాలీపరజ అంటే నల్లని చర్మము కలవారు అని అర్థం. అయితే ఇంకా చాలామంది చర్మముకంటె వీరిది కొంతనయమే. అంటే వీరికంటే నల్లగా ఉండేవారు చాలామంది ఉన్నారు.) శ్రీ జుగత్‌రాందవే ఈ శబ్దాన్ని రూపొందించారనుకుంటాను. భిల్లులు, గోండులువంటి రకరకాలైన అడవిజాతులు కొండజాతులను సూచించుటకు ఆదివాసి శబ్దం ఏర్పరచబడింది. ఆదివాసి అంటే దేశంలో అనాది నుంచీ నివసిస్తున్న అసలుప్రజ అని అర్థం. ఈ శబ్దాన్ని శ్రీ థక్కర్ బాపా తయారుచేశారు.

ఆదివాసులకు సేవ చేయుటకూడా నిర్మాణ కార్యక్రమంలో ఒక భాగం. ఈ కార్యక్రమంలో వారిసేవ 16 వ అంశంగా పేర్కొనబడుచున్నా, వారి ప్రాముఖ్యతను తక్కువగా చూడరాదు. మనదేశం చాల విశాలమైంది. ఇందులో ఎన్నో జాతులు నివసిస్తున్నాయి. అందుచేత నాకంటె సమర్థులైన వారుకూడా అన్ని జాతుల మనుష్యుల గురించి వారి స్థితిగతుల గురించి పూర్తిగా తెలుసుకోలేకపోయారు. మన దేశంలోని ప్రతీవ్యక్తీ, ప్రతీ యూనిట్ ఈ విషయాన్ని తెలుసుకుంటూన్న

కొద్దీ, పరస్పరం ఒకరిగురించి మరొకరు క్షుణ్ణంగా తెలుసుకొని యుండకపోతే, మన దేశాన్ని ఒక దేశంగా, జాతిగా నిలుపుకోవడం ఎంత కష్టమో బోధపడుతుంది.

భారతదేశం మొత్తంమీద ఆదివాసులు 2 కోట్లమంది ఉన్నారు. చాలకాలం క్రిందటనే గుజరాత్‌లోని భిల్లులమధ్య థక్కర్ బాపా పని ప్రారంభించారు. 1940 ప్రాంతాలలో థానా జిల్లాలో తగిన సహజసిద్ధమైన ఉత్సాహంతో బాబా సాహెబ్ ఖేర్ ఈ సేవా కార్యరంగంలోకి దూకారు. ఆయన ప్రస్తుతం ఆదివాసి సేవామండలికి అధ్యక్షులు.

భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో ఇలాగే పని చేస్తున్నవారు ఇంకా చాలామంది ఉన్నారు. ఎంతమంది ఉన్నా వారిసంఖ్య తక్కువే. నిజమాలోచిస్తే 'సేవాక్షేత్రంలో పంట బాగా పండిఉంది; కాని దానిని కోసితెచ్చేవారే తక్కువైనారు.' ఇలాంటిసేవ కేవలం భూతదయతో ప్రేరేపింపబడినది కాదనీ, ఇది సరియైన జాతీయసేవ, దేశసేవ అవుతుందనీ, ఈ విధమైన సేవ మనలను పూర్ణస్వరాజ్యమనే లక్ష్యానికి దాపుకు తీసుకు వెళుతుందనీ అంటే ఎవరు కాదనగలరు?

---

## 17 కుష్ఠురోగుల సేవ

కుష్ఠు అనేది చాల అసహ్యించుకోబడే శబ్దము. మధ్య ఆఫ్రికాతర్వాత భారత దేశంలోనే కుష్ఠురోగం ఎక్కువ. అయినప్పటికీ మనలో పేరుపొందిన శ్రేష్ఠవ్యక్తులవలెనే ఈ కుష్ఠురోగులుకూడ మన సమాజంలో ఒక భాగము. అయితే, అవసరం లేకపోయినా, ఆ కొద్దిమంది శ్రేష్ఠవ్యక్తులవైపే మన దృష్టి కేంద్రీకరింపబడి ఉంది; నిజంగా మన సహాయం అవసరమైన కుష్ఠురోగులు బుద్ధిపూర్వకంగా ఉపేక్షింపబడు తున్నారు. ఈ ఉపేక్షను హృదయహీనతగా చిత్రించాలని నాకనిపిస్తోంది. అహింసాయుతరీతిలో ఆలోచిస్తే ఇంతకంటె మరొక శబ్దంకూడ దొరకదు. భారత దేశంలో పనిచేసేవారిలో కేవలం క్రైస్తవ మిషనరీలుమాత్రమే కుష్ఠురోగులకు సేవచేయుటగురించి ఆలోచిస్తున్నది; అందుచేత వారిని అభినందించకతప్పదు. కుష్ఠురోగుల సేవకుగాను భారతీయులు నడిపే ఏకైకసంస్థ వర్ధాలో పనిచేస్తోంది. శ్రీ మనోహరదీవాన్ పరిశుద్ధమైన, ప్రేమపూర్వక సేవాభావంతో దానిని నడుపుతున్నారు. శ్రీ వినోబాభావే గారి ప్రేరణతోనూ, వారి మార్గదర్శకత్వంతోనూ ఆ సంస్థ పనిచేస్తోంది. భారత దేశంలో నిజంగానే నవజీవనం ప్రవేశించియుంటే, సత్యాహింసల మార్గంలో, వీలైనంత తక్కువ సమయంలో భారత దేశానికి స్వాతంత్ర్యం సంపాదించాలని నిజంగానే

మనం మథనపడుతుంటే, భారత దేశంలో మనంవెళ్ళి క్షేమ సమాచారాలు విచారించకుండా వదలివేయబడిన కుష్ఠురోగిగాని, బిచ్చగాడుగాని ఒకరైనా ఉండరాదు. సంస్కరింపబడిన ఈ నిర్మాణ కార్యక్రమంలో కుష్ఠురోగులసేవ అనే విషయాన్ని ఈ నిర్మాణ కార్యక్రమంయొక్క గొలుసులో మరొక కొక్కెముగా చేరుస్తున్నాను. ఎందుచేతనంటే మనదేశంలో కుష్ఠురోగులస్థితి ఎలాఉందో అలాంటిస్థితే నవీన నాగరికతగల బయటి ప్రపంచంలో మన భారతీయులదైయుంది. అయితే ఇరుగు పొరుగులను పరిశీలిస్తేగాని ఈవిషయం బోధపడదు. సముద్రం దాటివెళ్ళి మనదేశీయ సోదరులస్థితిని విచారించిచూస్తే అందరికీ నేను చెప్పినవిషయాలలోని యథార్థం బోధపడగలదు.

# 18 విద్యార్థులు

విద్యార్థుల విషయాన్ని నేను చివరకు అట్టేపెట్టాను. నేను వారితో నిరంతరం సంబంధం పెట్టుకుంటూ, దానిని పెంచుకుంటూ వస్తున్నాను. వారికి నేను తెలుసు. నాకు వారు తెలుసు. వారు నాకు చాలా పనిచేసిపెట్టారు. కాలేజీలనుండి బయటకు వచ్చిన చాలామంది నేడు నాకు సహచరులుగా ఉన్నారు. విద్యార్థులు భవిష్యత్తు యొక్క ఆశ అని కూడా నాకు తెలుసు. సహాయనిరాకరణోద్యమం పూర్తిపొంగులో ఉన్నప్పుడు కళాశాలలు, పాఠశాలలు వదిలి రమ్మని వారికి పిలుపు ఇవ్వబడింది. ఆ పిలుపును అందుకున్న ఆచార్యులు, విద్యార్థులు చాలగట్టిగా నిలిచి దేశసేవలో నిమగ్నమయ్యారు. దానివల్ల దేశానికి లాభించింది, వారికీ లాభించింది. తగిన వాతావరణం లేకపోవడంవల్ల అట్టి పిలుపు తిరిగి ఇవ్వలేదు. అయితే అప్పుడు కలిగిన అనుభవంవల్ల ఒక విషయం మాత్రం స్పష్టమైంది. అదేమంటే అసత్యము, అస్వాభావికము అయినప్పటికీ ప్రస్తుత విద్యావిధానము యొక్క మోహము దేశంలోని నవయువకులను ఎంతగా బిగించిందంటే వారు దానినుండి బయటపడలేకుండా ఉన్నారు. కాలేజీ చదువు 'కేరీర్' ని ఇస్తుంది. బ్రిటిష్ ప్రభుత్వం తయారుచేసిన తెల్లబట్టల సమాజం లోనికి కాలేజీ చదువుద్వారా ప్రవేశపత్రం లభిస్తుంది. స్వాభా

వికమైన జ్ఞానతృష్ణను తీర్చుకోవాలంటే ఏర్పడి ఉన్న దారిని వెళ్ళకపోతే మార్గాంతరం లేదు. మాతృభాష స్థానాన్ని ఆక్రమించి కూర్చొనియున్న పరాయిభాషను నేర్చుకొనుటకు విలువైన సంవత్సరాలెన్నింటిని వ్యర్థంచేస్తున్నారో వారికి ఆలోచనే లేదు. ఆధునిక భావాలను, ఆధునిక విజ్ఞానాన్ని మన భారతీయ భాషలు అందించలేవనీ, అందుకు మన భాషలు పనికిరావనీ ఈ విద్యార్థులకూ, ఉపాధ్యాయులకూ ఒక దురభిప్రాయం ఏర్పడి ఉంది. నాకు తెలిసినంతవరకూ జపాను దేశస్థులకు వారి మాతృభాషలోనే విద్య నేర్పబడుతుంది. అలాంటప్పుడు జపానీయులు తమ పనిని ఎలా నిర్వహించుకోగలుగుతున్నారా అని నాకు ఆశ్చర్యంవేస్తుంది. చైనాయొక్క అత్యున్నతి పాలకుడు జనరలిజ్మో చాంగ్-కై-షేక్ కు ఇంగ్లీషు రానిదానితో సమానం.

కాని, మన విద్యార్థులు తమ ధోరణిలోనే ఉన్నారు. ఈ యువతీ యువకులనుండి భావి దేశనాయకులు తయారు కావలసియుంది. మన దురదృష్టం ఏమంటే వారు ప్రతీ ప్రభావానికీ లొంగిపోతారు. అహింస అంటే వారికేమీ అంతగా ఆకర్షణలేదు. మాటకుజవాబు ఇటికలతోనూ, ఇటికలకుజవాబు రాళ్ళతోనూ ఇవ్వడమనేది వారికి చాల తేలికగా అర్థం అవుతుంది; అంతేకాదు, అదంటే వారికి ఇష్టంకూడా. దానివల్ల క్షణభంగురమైనా వారికి ఫలితం వెంటనే జంతువుకీ జంతువుకీ మధ్య, మనిషికీ మనిషికీ మధ్య అంతంకాని హింసయొక్క పోటీ మనకు కనబడుతుంది; ఇదీ అదే. అహింసను చక్కగా అర్థం

చేసుకోవాలంటే ధైర్యంతో విషయాలు తెలుసుకోవాలి. అంతే కాకుండా ధైర్యంతోనూ, సహనంతోనూ కష్టమైన విషయాలను ఆచరించాలి. రైతులు, కార్మికుల ఉద్యమాలలో ఏ కారణాలవల్లనైతే నేను పోటీసంఘాలు పెట్టాలని అనుకోలేదో ఆ కారణాలవల్లనే విద్యార్థిరంగంలో కూడా పోటీనుండి నేను దూరంగా ఉంటున్నాను. విద్యార్థి అనే పదానికి సరియైన అర్థం చెప్పుకుంటే, నా విశ్వవిద్యాలయం వేరైనప్పటికీ, నేను కూడా వారితో సహభాగియగు విద్యార్థినే. నేను ఉన్నయూనివర్సిటీకి వచ్చి నాతోపాటు నేను చేయుచున్న పరిశోధన (రీసెర్చి) కార్యాన్ని కొనసాగించమని విద్యార్థులకు శాశ్వత ఆహ్వానాన్ని అందిస్తున్నాను. అయితే నా విశ్వవిద్యాలయంలో చేరుటకు ఈ క్రిందినియమాలు అనుసరించాలి :

1. విద్యార్థులు పార్టీ రాజకీయాలలో పాల్గొనరాదు. వారు విద్యార్థులు, పరిశోధకులేగాని రాజకీయవేత్తలు కారు.

2. వారు రాజకీయ సమ్మెలలో పాల్గొనరాదు. విద్యార్థులు వీరపూజ చేయాలంటే చేయవచ్చు; అయితే, తమ వీరులను జైలులో పెట్టడం జరిగినా, వారు మరణించినా, వారిని ఉరికంబాల కెక్కించినా వారియెడల తమ భక్తిశ్రద్ధలను ప్రకటించుటకు వాటిలోని ఉత్తమగుణాలను తమ ఆచరణలోనికి తెచ్చుకోవాలేగాని విద్యార్థులు సమ్మెలకు దిగరాదు. అటువంటి సమయాలలో విద్యార్థుల శోకము భరించరానిదైతే తమ కళాశాల అధికారుల అనుమతితో కళాశాలనుగాని పాఠశాలను గాని మూసివేయవచ్చును. కళాశాల అధికారులు విద్యార్థుల

కోర్కెను మన్నించకపోతే విద్యార్థులు స్వంతబాధ్యతమీద సభ్యతాపూర్వకంగా, తగురీతిలో కళాశాలలనుంచి బయటకు వెళ్ళిపోవచ్చు. సంస్థల అధికారులు పశ్చాత్తాపపడి తిరిగి తమను పిలిచేవరకూ ఆ విద్యార్థులు తరగతులకు పోరాదు. ఏ స్థితిలో నైనాసరే తమకంటె భిన్నమైన అభిప్రాయాలు కలిగి తమతో కలిసిరాని విద్యార్థులపై గాని, ఉపాధ్యాయులపై గాని ఏ విధమైన బలవంతమూ, వత్తిడీ తేరాదు. తాము ఐక్యతతోనూ, ప్రవర్తించుటలో మర్యాదగానూ ఉంటే తమ విజయం నిశ్చయమనే నమ్మకం విద్యార్థులకు ఉండాలి.

3. అందరూ సేవాకార్యంగా ఎంచి వైజ్ఞానిక పద్ధతిలో నూలు వడకాలి. నూలు వడికే తమ పనిముట్లను, ఇతర సాధనాలను విద్యార్థులు సదా శుభ్రంగానూ పనిచేసే స్థితిలోనూ ఉంచుకోవాలి. వీలైతే ఆ సాధనాలను స్వయంగానే తయారు చేసుకోవడం నేర్చుకోవాలి. దానివల్ల సహజంగానే వారు వడికిన నూలు ఉత్తమస్థాయికి చెందినదై ఉంటుంది. నూలు వడుకుటకు సంబంధించిన సాహిత్యాన్నంతనూ దానిలో ఇమిడియున్న ఆర్థిక, సాంఘిక, రాజకీయ, నైతిక విషయాలను అర్థం చేసుకుంటూ అధ్యయనం చేయాలి.

4. వారు ఖాదీనే ఉపయోగించాలి. విదేశాలనుంచివచ్చే వస్తువులకు బదులు గ్రామాలలోనే తయారయ్యే వస్తువులను దొరికినంతవరకూ వాడాలి.

5. వందేమాతరం గీతం పాడేవిషయంలోనూ, జాతీయ జండాను ఎగురవేసే విషయంలోనూ ఇతరులను బలవంత పెట్ట

రాదు. జాతీయ జండా గుర్తులను విద్యార్థులు తమ చొక్కాలపై పెట్టుకోవచ్చు, అంతేగాని ఇతరులను పెట్టుకోమని బలవంతం చేయకూడదు.

6. త్రివర్ణ పతాకంయొక్క సందేశాన్ని తమ జీవితాచరణలో జీర్ణింపచేసుకుని కులతత్వానికీ, అంటరానితనానికీ తావు లేకుండా చేయాలి. ఇతరమతాలకు చెందిన విద్యార్థులతోనూ, హరిజన విద్యార్థులతోనూ ప్రాణసమానంగా స్నేహం పెంపొందించుకోవాలి.

7. ఇరుగుపొరుగున బాధపడేవారికి వెంటనే ప్రాథమిక చికిత్స చేయాలి. గ్రామాలకు వెళ్ళి సఫాయీ కార్యక్రమాన్నీ, భంగీపనినీ చేయాలి. గ్రామాలలోని పెద్దలకూ, పిన్నలకూ చదువు నేర్పాలి.

8. రెండు రూపాలు కలిగిన జాతీయ భాషయగు హిందుస్తానిని వారు నేర్వాలి. రెండు శైలులను, రెండు లిపులను నేర్చుకుంటే హిందీ, ఉర్దూలలో ఎవరు ఏదిమాట్లాడినా అర్థంచేసుకొనుటకు, నాగరి ఉర్దూలిపులలో ఎవరు ఏది వ్రాసినా తెలిసికొనగలుగుటకు వీలుంటుంది.

9. విద్యార్థులు ఏక్రొత్త విషయాలను నేర్చుకున్నా వాటిని తమ మాతృభాషలో వ్రాసుకుని తాము గ్రామాలకు వెళ్ళినపుడు ఆవిషయాలను అచటివారికి అందజేయాలి.

10. విద్యార్థులు ఏపనినీ రహస్యంగా చేయరాదు. ఏపని చేసినా బహిరంగంగానే చేయాలి. తాముచేసే ప్రతీ పనిలోనూ వారి ఆచరణ పరిశుద్ధమైనదై ఉండాలి. వారు తమ జీవితాన్ని

సరళంగానూ, నిగ్రహపూర్వకంగానూ గడపాలి. దేనికీ భయపడ రాదు తమ బలహీనమైన సహచరులను రక్షించుటకు సదా నిర్భయంగా సిద్ధంగా ఉండాలి. ఉపద్రవాలు ఏర్పడితే తమ ప్రాణం పణంగా ఒడ్డయినా సరే వాటిని నివారించుటకు ప్రయత్నించాలి. చివరకు స్వాతంత్ర్య సమరంయొక్క చరమ స్థితిలో తమ సంస్థలను వదలి యుద్ధభూమిలోకి దూకాలి. అవసరమైతే దేశ స్వాతంత్ర్య సంపాదనలో ప్రాణాలను బలి చేయుటకు వెనుకాడరాదు.

11. తమతోపాటు చదివే విద్యార్థినుల యెడల, సోదరీ మణుల యెడల సభ్యతాపూర్వకంగానూ, పరిశుద్ధంగానూ వ్యవహరించాలి.

విద్యార్థులకుగాను నేను పైన చెప్పిన కార్యక్రమాన్ని ఆచరించుటకు వారు తీరికచేసుకోవాలి. బద్ధకంతో వారెంతో సమయాన్ని వృధాచేస్తారని నాకు తెలుసు. సమయపాలనలో కఠినంగా ఉంటే నేను చెప్పిన కార్యక్రమాలు ఆచరించుటకు వారు కొంత తీరికచేసుకో గలుగుతారు. అయితే ఏవిద్యార్థి మీదా అవాంఛనీయమైన బరువును నేను మోపదలచుకోలేదు. అందుచేత దేశభక్తిగల విద్యార్థులు తమ చదువుసమయంనుండి ఒక సంవత్సరం ఈపనికి ఇవ్వమని నేను సూచిస్తున్నాను. అయితే ఒకేసారి సంవత్సరం అంతా ఈపనికొరకు చదువు మానుకోమని నే ననడంలేదు. తమ చదువుకాలం మొత్తంమీద పంచుకుని ఒక సంవత్సరం ఈపనికి విద్యార్థులు వినియోగించగలరు. ఈవిధమైన పనితో గడిపిన సంవత్సరం వృథాగా పోలేదని వారికి తర్వాత

నమ్మకం కలుగుతుంది. ఈవిధంగా పనిచేయుటవల్ల దేశస్వాతంత్ర్య సమరంలో తమ పాత్రనుకూడా నిర్వహించిన వారౌతారు; అంతేకాక ఈపనిలో చేసిన శ్రమవల్ల విద్యార్థుల మానసిక, శారీరిక, నైతిక శక్తులుకూడ అభివృద్ధి చెందుతాయి.

## సత్యాగ్రహముయొక్క స్థానము :

నిర్మాణ కార్యక్రమాన్ని మొత్తం దేశం అంతటి సహకారాన్ని పొంది ఆచరించగలిగితే, అహింసాయుత విధానంలో దేశానికి స్వాతంత్ర్యం సంపాదించుటకు సత్యాగ్రహం అవసరం లేదని నేను ఇందులో చెప్పాను. అయితే దేశాలకుగాని, వ్యక్తులకు గాని అంతటి అదృష్టం కలగడం అసంభవమనే చెప్పాలి. అందుచేత దేశవ్యాపితమైన అహింసాయుత పద్ధతిలో సత్యాగ్రహానికిగల స్థానాన్ని మనం అర్థంచేసుకోవాలి.

సత్యాగ్రహంవల్ల మూడు వేరువేరు పనులు కాగలుగుతాయి.

1. స్థానిక అన్యాయాన్ని దేనినైనా నిరోధించుటకుగాను సత్యాగ్రహాన్ని విజయవంతంగా ప్రయోగించవచ్చు.

2. ఏదో ఒక ప్రత్యేకమైన అన్యాయాన్ని గాని, కష్టాన్ని గాని తొలగించాలనే ఉద్దేశంకాక, స్థానికప్రజలను ఆ అన్యాయం, ఆ కష్టం గురించి చైతన్యవంతులను చేయుటకు, తమ కష్టాన్ని వారు గుర్తించునట్లు చేయుటకుగాను ఆత్మ బలిదాన విధానంలో సత్యాగ్రహం చేయవచ్చు. చంపారన్‌లో ఇదే జరిగింది. నేను చేయబోయే పనిప్రభావం ఎలా ఉండగలదు అని ఊహించ

కుండానే, ప్రజలు శ్రద్ధకూడా తీసుకోకపోవచ్చు అని అను
కుంటూనే, చంపారన్‌లో నేను శాసనోల్లంఘనం చేశాను. నేను
ముందుగా ఊహించని పరిణామం అక్కడ నా పనివల్ల కలిగింది.
దీనిని ఎవరి ఇష్టాన్నిబట్టి వారు ఈశ్వరకృప అనిగాని, అదృష్టపు
పంట అనిగాని అనుకోవచ్చు.

3. నిర్మాణ కార్యక్రమానికి ప్రజల సహకారం పూర్తిగా
లభించనప్పుడు, 1941 లో ప్రారంభించబడిన సత్యాగ్రహం
వలె, శాసనోల్లంఘనం ప్రారంభించవచ్చును. 1941 పోరాటం
సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనాసమరంలో ఒక భాగమైనప్పటికీ
దానిని వాక్ స్వాతంత్ర్యం వరకే పరిమితిచేశాము. ఆ విషయమే
అందు ప్రాధాన్యత వహించింది. విశాలమైన లక్ష్యంకొరకు,
ఉదాహరణకు స్వాతంత్ర్యప్రాప్తి కొరకు, శాసనోల్లంఘనం లేక
సత్యాగ్రహం పనిచేయదు. సత్యాగ్రహంద్వారా మనం సాధించ
దలచుకున్నది స్పష్టంగానూ, ఎదుటివారికి చక్కగా అర్థము
కాగలుగునట్లూ సత్యాగ్రహంద్వారా ఆ విషయం పరిష్కరింప
బడుటకు వీలున్నదీ అయిఉండాలి. ఈ విధానాన్ని సరిగా
ఉపయోగిస్తే లక్ష్యంవరకూ తీసుకు వెళ్ళగలుగుతుంది.

సత్యాగ్రహం యొక్క కార్యక్షేత్రం గురించీ, రాగల
పరిణామాల గురించీ నేనిక్కడ పూర్తిగా చర్చించలేదు.
నిర్మాణ కార్యక్రమానికీ సత్యాగ్రహానికీ గల సంబంధాన్ని
పాఠకులు అర్థం చేసుకొనుటకు అవసరమైనంతవరకే నేను
విషయాన్ని వివరించాను. పైన చెప్పిన మూడు విషయాలలోని
మొదటి రెండింటికీ నిర్మాణ కార్యక్రమాన్ని భారీఎత్తున కొన

సాగించవలసిన అవసరం లేదు. అయితే సత్యాగ్రహం, శాస నోల్లంఘనం ద్వారా సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించాలని అనుకుంటే మొదటినుంచీ ఏర్పాట్లు చేసుకోవలసి యుంటుంది. ఈ ఏర్పాట్లవెనుక ఈ యుద్ధంలో పాల్గొన్నవారి చైతన్యయుత మైన, ప్రత్యక్ష సంబంధం ఉండాలి. ఈ విధంగా సత్యాగ్రహం అనేది ప్రజలను ఉత్సాహపరచి ప్రతికక్షులను సవాల్ చేయునదై యుండి దేశంలోని కోట్లాది ప్రజానీకం నిర్మాణ కార్యక్రమ రీత్యా సహాయం చేయకపోతే, స్వరాజ్య సంపాదనకు కేవలం సత్యాగ్రహం చాలదనీ, అంతేకాక దానివల్ల హాని కలగవచ్చు ననీ పాఠకులు గ్రహించిఉంటారు.

---

# ఉపసంహారము

జాతీయ కాంగ్రెసు పక్షమునగాని, దాని కేంద్రీయ సమితి పక్షమునగాని తాత్త్వికవివేచనగా ఈ 'నిర్మాణ కార్యక్రమము'ను వ్రాయలేదు. సేవాగ్రామంలో ఉండే కొద్దిమంది సహచరులతో జరిపిన సంభాషణల ఫలితంగా ఈ నిర్మాణ కార్యక్రమం వ్రాయబడింది. నిర్మాణ కార్యక్రమం, సత్యాగ్రహం మధ్య ఉన్న సంబంధం ఏమిటి? నిర్మాణ కార్యక్రమాలను ఎలా ఆచరించవచ్చు? అను విషయమై స్వయంగా నేను వ్రాసినదేదీ లేకపోవుట వారికి లోటుగా కనిపించింది. ఈ పుస్తకంద్వారా ఆలోటును తీర్చాలని ప్రయత్నించాను. నిర్మాణ కార్యక్రమం గురించి పూర్తి అధ్యయనంకొరకుగాని లేక నిర్మాణ కార్యక్రమంగురించి వివరంగా చెప్పాలనిగాని ఈపుస్తకం వ్రాయలేదు; నిర్మాణ కార్యక్రమాన్ని ఎలా ఆచరించవచ్చును; ఎలా ఆచరించాలి అనే విషయంమాత్రమే ఇందు చర్చించబడింది

ఈ పుస్తకంలో వివరించబడిన నిర్మాణకార్యక్రమ అంశాల నుండి ఏదో ఒక దానిని తీసుకుని, సంపూర్ణ స్వరాజ్య సాధనకై చేయబడుచున్న సమరంలో అంశంగా దానిని భావించి, ఆ అంశాన్ని, పరిహసించునట్టి తప్పిదాన్ని పాఠకులు చేయకుందురు గాక. అహింసతోగాని, పూర్ణస్వరాజ్య స్థాపనతోగాని సంబంధం లేకుండా ఎంతోమంది ఎన్నో చిన్నపనులూ, పెద్దపనులూ చేస్తూ ఉంటారు. అందుచేత ఆ పనులగురించి ఎంత ప్రచారం

ఉంటే అంతవరకే పరిమితంగా వాటికి ప్రతిఫలం లభిస్తుంది. సేనాపతి మామూలు పౌరుని దుస్తుల్లో తిరిగితే ఎవరూ అతని గురించి పట్టించుకోనైనా పట్టించుకోరు. అదే, తన హోదా ననుసరించి అతను దుస్తులు వేసుకుంటే, చాల పెద్దవాడౌతాడు. అతని ఒక్కొక్క ఆజ్ఞపై లక్షలకొద్దీ ప్రజలు జీవించడమూ, మరణించడమూ అనేది ఆధారపడి ఉంటుంది. అలాగే ఒక పేద వితంతువు చేతుల్లోని చరఖా ఎక్కువలో ఎక్కువ ఆమెకు నాలు గైదు పైసలు సంపాదించి పెట్టగల సాధనంగా ఉంటుంది. కాని అదే చరఖా జవాహరులాల్ నెహ్రూ చేతిలో భారత స్వాతంత్ర్యసమర ఆయుధంగా మారిపోయింది. చరఖాకు మన మిచ్చిన స్థానం, దానిపై వేసిన బాధ్యతబట్టి దాని ప్రతిష్ఠ పెరిగింది. నిర్మాణ కార్యక్రమానికి అప్పగించిన బాధ్యతనుబట్టీ, అందు మూలంగా దానికి లభించిన అధికారం ఫలితంగానూ నిర్మాణ కార్యక్రమానికి అసాధారణమైన ప్రతిష్ఠ, అమోఘమైన బలము లభించాయి.

ఇది నా అభిప్రాయము. ఈ అభిప్రాయము ఒక పిచ్చి వాని ఆలోచనకూడ కావచ్చు. కాంగ్రెసువారికి నా ఈ అభిప్రాయం నచ్చకపోతే వారు నన్ను వదలివేయవచ్చును. ఎందుచేత నంటే నిర్మాణ కార్యక్రమం అనుసరించకుండా శాసనోల్లంఘన సమరాన్ని ప్రారంభించాలంటే, అది పక్షవాతంవల్ల పడిపోయిన చేతితో చెంచా ఎత్తుటకు పూనుకున్నట్లు అవుతుంది.

పూనా, 13-11-1945

---

# అనుబంధం

## 1. పశుగణాభివృద్ధి

[ నిర్మాణ కార్యక్రమంలో గోసేవను ఒక అంశంగా చేర్చుటగురించి గాంధీజీ వ్రాసిన విషయాన్ని ఈ క్రింద నిస్తున్నాము. —జీవన్‌జీ దేశాయి ]

*శ్రీ జీవన్‌జీ దేశాయికి గాంధీజీ రాసిన ఉత్తరంలోని భాగము :*

సోదేపూర్
16-1-46.

"...మీరు చెప్పింది బాగుంది. గోసేవ అనే విషయాన్ని కూడా నిర్మాణ కార్యక్రమంలో చేర్చాలి. నేను దీనిని *పశుగణాభి* వృద్ధి అంటాను. దీనిని విస్మరించి వదిలిపెట్టరాదనే నా అభి ప్రాయము. రాబోయే ముద్రణలో దీనిగురించి ఆలోచిద్దాము."

## 2. కాంగ్రెసుయొక్క స్థానము, దానిపని

భారత జాతీయ కాంగ్రెసు దేశంలో పురాతనమైన జాతీయ రాజకీయసంస్థ. ఎన్నో అహింసాయుత పోరాటాల అనంతరం అది స్వాతంత్ర్యాన్ని సంపాదించింది. దానిని అలా నాశనం కానివ్వలేము, దేశం నాశనమైనప్పుడే అది నాశనం కాగలుగుతుంది. సజీవమైన ప్రాణివలెనే సజీవమైన సంస్థ నిరం తరం అభివృద్ధి చెందుతూనైనా ఉంటుంది, లేదా మరణిస్తుంది.

కాంగ్రెసు రాజకీయ స్వాతంత్ర్యాన్నైతే సంపాదించింది కాని ఇంకా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని, సాంఘిక స్వాతంత్ర్యాన్ని, నైతిక స్వాతంత్ర్యాన్ని అది సాధించవలసి ఉంది. ఈ స్వాతంత్ర్యాలు నిర్మాణాత్మకమైనవి, తక్కువ ఉద్రేకాన్ని చ్చేవి, రెచ్చగొట్టుటకు వీలు లేనివి అయినందున రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుట కంటె, వీనిని సంపాదించుట కష్టం. జీవితంయొక్క వివిధ క్షేత్రాలనూ తనలో ఇముడ్చుకోగల నిర్మాణ కార్యక్రమం కోట్లకొద్దీ ప్రజానీకం యొక్క అన్నివిధములైన శక్తినీ మేల్కొల్పుతుంది.

కాంగ్రెసుకు తాను సంపాదించ దలచుకున్న స్వాతంత్ర్యంలో అవసరమైన, మొదటిభాగం లభించింది. అయితే అన్నిటికంటే కష్టమైన మజిలీని అది ఇంకా దాటవలసియుంది. ప్రజాస్వామ్య వ్యవస్థను స్థాపించడమనే కష్టమైన లక్ష్యాన్ని చేరుకొను ప్రయత్నంలో తప్పనిసరియై ముఠాతత్వాలకు నిలయమైన బురదగుంటలవంటి సంఘాలను కాంగ్రెసు స్థాపించింది. వానివల్ల లంచగొండితనం, అవినీతి పెరిగాయి. కేవలం పేరుకుమాత్రమే ప్రజాస్వామ్యంగా ఉండే సంస్థలు వెలిశాయి. ఈ అన్నివిధముల దోష భూయిష్టమైన అడవినుంచి ఎలా బయట పడగలం ?

అన్నిటికంటె ముందుగా, ఎప్పుడూ కోటికంటే మించని, తేలికగా గుర్తించుటకు కూడా వీలులేని కాంగ్రెసుసభ్యుల ప్రత్యేక పట్టికను తీసి అవతలపెట్టాలి. కాంగ్రెసువద్ద ఎన్నడూ తనచే కోరబడనటువంటి కోటానుకోట్ల ప్రజల అజ్ఞాతపట్టిక